


## మద్రాసు రాష్ట్రమున స్త్రీవిద్యాభివృద్ధి

మద్రాసురాజధాని విద్యాశాఖాధికారి 1930-వ సంవత్సరపునివేదిక వెలువడినది. గత వత్సరముకంటె నివేదితవత్సరమున మద్రాసురాజధానియందు స్త్రీవిద్యావిషయికమై గమనింపదగిన అభివృద్ధిగాన్పించుచున్నది. నివేదితవత్సరమున బాలికలకొఱకు ప్రత్యేకముగానేర్పఱుపబడిన పాఠశాలలసంఖ్య పెరిగినది; ఆపాఠశాలలయందు చదువవచ్చినవారి సంఖ్యయుపెరిగినది. 1929-వ సంవత్సరమున మనరాజధానియందు చదువుచున్న బాలికల సంఖ్య 635,207 మాత్రమే. 1930-వ సంవత్సరమున వారిసంఖ్య 667, 332 లకుపెరిగెను. మద్రాసురాష్ట్రమున ప్రత్యేకము స్త్రీలకొఱకు ఐదుకళాశాలలుగలవు. ఈకళాశాల లన్నిటియందును గడచినసాలున 376 గురు విద్యార్థినులుమాత్రమే విద్యగైకొనియుండగా 1930-వ సంవత్సరమున 494 గురు విద్యార్థినులు విద్యగైకొనిరి. వీరుగాక పురుషులకుద్దిష్టమైన కళాశాలలయందును కొందరుస్త్రీలు విద్యాసముపార్జనముచేయుచున్నారు. అట్టివారు 1929 వ సంవత్సరమున 112 గురుమాత్రమే ఉండగా నివేదితవత్సరమున 139 గురుఉండిరి. విద్యార్థినులసంఖ్యయందలి ఈయభివృద్ధి మద్రాసురాజధానిస్త్రీలలో విద్యార్జనాతృష్ణ చిగురులు వెట్టుచున్న దనుటకు మంచినిదర్శనము.

ఉపాధ్యాయినీవృత్తికంటె వైద్యవృత్తి మనస్త్రీల నెక్కువగ నాకర్షించుచున్నట్లుగానవచ్చుచున్నది. ఏమందురా? నివేదితవత్సరమున ప్రభుత్వమువారి వైద్యకళాశాలలయందు 64 గురువిద్యార్థినులు ఉండిరి. ఇక మద్రాసునందుగల స్త్రీలబోధనాభ్యసనకళాశాలల రెంటియందును 54 గురువిద్యార్థినులుమాత్రమే ఉండిరి. మనరాష్ట్రమున ప్రత్యేకము స్త్రీలకు రెండు వైద్యపాఠశాలలుగలవు. అందు 1930-వ సంవత్సరమున 160 మందివిద్యార్థినులు విద్యాశిక్షగొనిరి. స్త్రీబాలరోగములవిషయమై పనిచేయుటకు వైద్యురాండ్రు కావలయునను

విషయము సర్వజనాంగీకారమునుబడసినదే. వైద్యశాలలయందు వైద్యశాలలులేని గ్రామ సీమలయందు వైద్యురాండ్ర ఆవశ్యకతఎంతేనియుగానిపించుచున్నది. పురుషుడగువైద్యుని కంటబడనొల్లని ఘోషా-కంటబడినను పల్లెత్తి ఆతనితోపలుకాడనొల్లని లజ్జ-పలుకాడినను ఆతనిచేచేయిచూపించుకొననొల్లని ఆభిజాత్యము-చుట్టువాటి మట్టువిూటియుండ భారతస్త్రీ లెందఱో రోగదేవతకు ఆజన్మము సేవకురాండ్రై యుండుచున్నారు. స్త్రీవైద్యుల సంఖ్య పెరుగుచో ఈఇక్కట్టుపాటు తప్పిపోవగలదు. అగుట వైద్యకళాశాలలయందును వైద్యపాఠశాలలయందును విద్యార్థినులసంఖ్య పెరుగుచున్నందులకు మాఆనందమును వెలిబుచ్చుచు ఏటేట నిట్లే పలువురువిద్యార్థినులు వైద్యవిద్యాసముపార్జనమునకు గడంగుదురుగాకయని ఆశించుచున్నాము. వైద్యవృత్తి ఎంతటిగౌరవాస్పదమైనదో ఉపాధ్యాయినీవృత్తికూడనంతటిగౌరవాస్పదమైనదే. కానిమనవిద్యార్థినులకు వైద్యవృత్తిపై ఎక్కువమోజు ఎసరేగుచున్నది. దీనిని మేము ప్రశంసింపజాలము. మద్రాసురాజధానియందుస్త్రీవిద్యాభివృద్ధికిగల ఆటంకములలో తగుఉపాధ్యాయినులులేమి ప్రబలమైనదనుట ప్రముఖులంగీకరించియున్నారు. ప్రభుత్వము వారును ఈవిషయమై అప్రమత్తులైయున్నారు. నివేదితవత్సరమున ప్రభుత్వమువారు స్త్రీల కొఱకు ప్రత్యేకము క్రొత్తబోధనాభ్యసనపాఠశాలలను ప్రారంభించినారు. 1929-వ సంవత్సరములో ప్రభుత్వమువారునిర్వహించు స్త్రీలబోధనాభ్యసనపాఠశాలలు 28 మాత్రమే. నివేదితవత్సరమున 37. ప్రభుత్వమువారు నిర్వహించినవైననేమి ప్రజాసంఘము నిర్వహించినవైననేమి మనరాజధానిమొత్తమువిూద నివేదితవత్సరమున స్త్రీలబోధనాభ్యసనపాఠశాలలు 58. గడిచినసాలున 50 మాత్రమే. ఇట్లు ఉపాధ్యాయినీవృత్తికొఱకు తరిబీయతునొంద విద్యావతులగుస్త్రీలకు తగువీళ్లుకల్పింపబడుచున్నవి. కావున విద్యావతులు దేశహితైక బుద్ధినివహించి ఉపాధ్యాయినీవృత్తినిగైకొని దేశావృతమైన అజ్ఞానాంధకారమును పాఱద్రోల ఇంటింటవిద్యాజ్యోతిని ప్రజ్వలితముగావింతురుగాకయని గోరుచున్నాము. వైద్యవృత్తి నవలంబించి ఆమయాంధకారమును వెడలించుటలో ఎంతగౌరవము, ఎంతపుణ్యము ఉన్నదో ఉపాధ్యాయినీవృత్తినవలంబించి అజ్ఞానాంధకారమును వెడలించుటలోకూడ అంత గౌరవము, అంతపుణ్యము ఉన్నదను సత్యమును మనవిదుషీమణులు గ్రహింతురుగాక!

స్త్రీలకుసంబంధించినంతవఱకు సెకండరీవిద్యావిషయమునగూడ నివేదితవత్సరమున మంచి అభివృద్ధిగానిపించుచున్నది. 1930-వ సంవత్సరమున మనరాజధానియందు 42 ఉన్నత పాఠశాలలును, 28 మిడిల్‌స్కూల్లును ప్రత్యేకముస్త్రీలకొఱకే ఏర్పడియున్నవి. 1929-వ సంవత్సరమున ఈపాఠశాలలయందు 14556 గురు విద్యార్థినులే విద్యగైకొనియుండగా నివేదితవత్సరమున 15784 గురువిద్యార్థినులు విద్యగైకొనిరి. వీరుగాక బాలురపాఠశాలల యందునుకొందఱు విద్యార్థినులువిద్యగైకొనిరి. అట్టివారిసంఖ్య 1929-వ సంవత్సరములో 17267 గురు, 1930-వ సంవత్సరములో 18837 గురు. సంఖ్యలయందుగల ఈయభివృద్ధి

సంతోషమునకుగారణమగుచున్నది. మూడవఫారముచదువుతుదముట్టువరకు పేదవిద్యార్థినులకు జీతములేకుండగనే విద్యగఱుపబడుచున్నది. ఉన్నతవిద్యావిషయమునగూడ స్త్రీలకిట్టిసౌకర్యములేర్పఱుపబడుటవాంఛనీయము. విద్యార్థిసీవేతనములు, సగముజీతములు మొదలగు సౌకర్యములను విరివిగనేర్పాటుచేసి స్త్రీవిద్యాభివృద్ధివిషయములో ప్రభుత్వమువారు ప్రత్యేకశ్రద్ధనుబూని ప్రత్యేకవ్యయమును భరింపవలసియున్నది.

బాలికల ప్రాథమికవిద్యాభివృద్ధివిషయములో నివేదితవత్సరమున కొన్నిసౌకర్యములుగావింపబడినవి. రెండువేలుగాని రెండువేలకుమించిగాని జనభాగలగ్రామములలో బాలికలకు ప్రత్యేకముగ ప్రాథమికపాఠశాలలు ప్రతిష్ఠించుటకు స్థానికసంస్థలకు ప్రభుత్వమువారు ధనసహాయముచేయుపద్ధతి ఈవత్సరముకూడ నమలులోనుండెను. వేయిమందిగాని వేయిమందికిమించిగాని మహమ్మదీయులుగలతావులయందు మహమ్మదీయబాలికలకు ప్రత్యేకముగ ప్రాథమికపాఠశాలలు ప్రతిష్ఠించుటకునిర్ణతమైనది. 1930-వ సంవత్సరమున బాలికలకొఱకైన నూతనప్రాథమికపాఠశాలలు 477 తెఱువబడినవి. వీనికైనవ్యయము 1,72,476 రూపాయిలు. ఈవ్యయము రాష్ట్రీయాదాయమునుండియే. ఇట్లేర్పఱుపబడిన 477 నూతనప్రాథమికపాఠశాలలలోను 61 ప్రత్యేకము మహమ్మదీయబాలికలకు. రాష్ట్రప్రభుత్వమువారివ్యయమున 240 గురు క్రొత్తఉపాధ్యాయులు నియమింపబడిరి. ఇందుకైనసాలుసరిఖర్చు 57,600 రూపాయిలు. రాజధానిమొత్తమువిూద బాలికలప్రాథమికపాఠశాలలయందు పనిచేయుచున్న ఉపాధ్యాయులు నివేదితవత్సరమున 13273 గురు. 1929-వ సంవత్సరమున 12,001రు మాత్రమే. ఈ 13273 గురు ఉపాధ్యాయులలోను 9781 గురు ట్రెయినింగుఅయినవారు. 1929-వ వత్సరమున ట్రెయినింగుఅయిన ఒక్కొక్క ఉపాధ్యాయునకు సగటున 34 గురు విద్యార్థినులు ఉండ 1930-వ సంవత్సరమున 33 గురు ఉండిరి. బాలికలప్రాథమికపాఠశాలలలో నివేదితవత్సరమున 69 దింటికి నూతనభవనములు నిర్మింపబడెను. ఇందు 10 ప్రజలు నిర్వహించు పాఠశాలలకుచెందినవి.

బాలికలప్రాథమికపాఠశాలల సంఖ్యపెరిగినది; అందు విద్యగైకొనుచుండిన బాలికల సంఖ్యయుపెరిగినది; బాలురబడులయందుచదువుచుండిన బాలికలసంఖ్యయు 318,156 నుండి 328,043 లకుపెరిగినది. సంఖ్యలపెరుగుదలనుబట్టి సంతోషింపవలసియేయున్నది. కాని బాగుగపరిశీలించుచో ఈసంతోషము ఈడబోవుచున్నది. మొదటితరగతియందున్నంతమంది విద్యార్థినులు రెండవతరగతియందుకానరారు. తరగతులుహెచ్చుకొలదియు బాలికల సంఖ్యయందు భయావహమగు తగ్గుదలగానవచ్చుచున్నది. దేశమున పాదుకొనియున్న అతిబాల్యవివాహాదిసాంఘికదురాచారములను తిరస్కరింపగలతిక్క బాలికలతలిదండ్రులకుగలిగినగాని ఈవిషయమునఎట్టిమోక్షమునుగన్పట్టజాలదు. కావున నాయకులీవిషయమునప్రత్యేకశ్రద్ధవహించి వలయుప్రచారము, ప్రబోధముగావింతురుగాక యని హెచ్చరించుచున్నాము.

# "ఏదీ స్వర్గము?"

అప్పుడే శ్మశానభూమినుండి తిరిగివచ్చినాడు తండ్రి. చూపులో వెల్తియు, విచారము; హృదయములో వేదనాభారము; ఆకృతిలో దైన్యము.

కిటికీదగ్గర అతని యేడేండ్ల బాలిక నిలువబడియున్నది. బాగుగా తెరచినకన్నులు; మెడలో బంగారుగొలుసు. వయసుకుమించినఆలోచనలు, అర్థముకాని ఊహలు, ఆమెముఖములోను, చూపులలోనుప్రతిఫలించినవి. వచ్చినంతనే తండ్రి పుత్త్రికను చేతులలోనికి తీసికొన్నాడు. అతనికనులలో ప్రేమనిండినది; అశ్రుబిందువులుకూడను. "నాన్నా! అమ్మయేదీ?" అని పాప మాబాలిక తండ్రిని ప్రశ్నించినది.

"స్వర్గములోనున్నది" అనుచు తండ్రి ఆకాశమువైపు వ్రేలిడి చూపించినాడు.

ఆరాత్రి విషాదపుబడలికతో, కలగినభావములతో, స్వప్నభంగీకృతమైననిద్రావస్థకు లోనైనాడుతండ్రి. పడకగదితలుపుదగ్గర ఒకచిన్న దీపము మినుకుమినుకులాడుచు వెలుగుచున్నది. గోడమీదిపురుగులను ఒకబల్లి వేటాడుచున్నది. అంతటను నిశ్శబ్దము.

బాలికకు తెలివివచ్చినది. చేతులతో ప్రక్కనుతడవినది; కాని యెవరునులేరు. తలుపుతెరచుకొని ఆమె మెల్లగా పైకివచ్చినది.

పాపము, ఆబాలిక కనులెత్తి, ఆకాశమువైపు ఎంతోసేపు నీరవముగాచూచినది. కలతచెందిన ఆమె మృదుహృదయమే "ఏదీస్వర్గము?" అనుప్రశ్నను విశాలనిశాగర్భములోనికి పంపినది. జబాబురాలేదు; అమాయికమైన ఆచీకటి కనులమంచుచున్న అశ్రుకణములవలె నక్షత్రములు మెరయుచు కన్పించినవి.

—వేంకటకాళిదాసకవులు.

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ! మహాత్మునకును ప్రభుత్వమునకును సంధికుదిరినది. తనయుల చెఱసాల క్లేశంబులు తలచితలఁచి తల్లడిల్లిపోవుచున్న అరువది వేలమాతృహృదయములు ఆనందముతో నుప్పొంగుచు మహాత్ముని సత్యసమరమునకు జయగీతములు పాడుచున్నవి. కల్పలతా! పది వత్సరములనుండియు ఈయుద్యమము మనదేశమున సాగుచున్నను ఈవత్సరము మహాత్ముని చిత్తమును స్త్రీలును, స్త్రీలచిత్తమును మహాత్ముఁడును నాకర్షించినట్లు మఱెప్పుడును జరిగి యుండలేదు.

ఇది అద్భుతమైన పరివర్తనము. అసదృశమైన కార్యము. కావుననే మహాత్ముఁడిది మహిళాశకమని వ్రాక్రుచ్చుటయేగాక ఈపదిరెండునెలలనుండియు అపారమగు సేవచేయుచున్న సోదరీమణుల సహాయమును నేను ముఖ్యముగా అపేక్షించెదననియు, పదిరెండేండ్లలో జరుగుపనిని వారు పదిరెండుమాసములలో నెరవేర్పగలిగిరనియు శ్లాఘించియున్నాడు. నిజముగా మనసోదరీమణులు గావించినసేవయు నిరుపమానమే. మనదేశమున స్త్రీలకు స్వేచ్ఛ లేదు. మనము శ్వేతస్త్రీలవలె ఆరితేరిన చదువును, అనిర్బంధకమైన మతమును, ఆక్షేపింపని సంఘమును కలవారముకాము. శరణాలయములో బిడ్డలనిడి హోటళ్లలో తిండితిని కాలక్షేపముచేయుటకు మన గృహిణీత్వధర్మము లంగీకరింపవు. ఇట్టి ప్రతికూలములు పెక్కులున్నను ఈపదిరెండుమాసములనుండియు మనభారతమహిళలు దేశమునకు చేసిన సేవ, చూపినత్యాగము, అనుభవించిన కష్టములు, అసాధారణము. కాని యుగయుగముల భారతేతిహాసము బరించితిమేని మనభారతమహిళల కీనిర్బంధాదికములు క్రొంగ్రొత్తగాదని తోచెడిని.

నిరంకుశపరిపాలనాక్లేశములకు బాల్పడిన తమదేశజననిని మన భారతమహిళలు యుగయుగములందును ఇటులనే రక్షించియున్నారు. ఏయుగమునందును స్త్రీలు చెఱసాలలందు ప్రవేశింపక భారతవర్షము సుఖస్థితిని బడసియుండలేదు. "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి"యను సూక్తి నేటిమాటగాదు. చూడుము: త్రేతాయుగమున సింహళప్రభువైన రావణుని నిరంకుశపరిపాలనము భారతీయులను కడగండ్లపాలుచేసెను. ఎట్టివీరాధివీరులును నాతనిని జెనకజాలకుండిరి. దేవతలమహిమగాని, బాపలతపముగాని, రాజులమగటిమిగాని వానిని నిర్జింపజాలకపోయెను. వానివలని బాధయా; సకలప్రాణియము నల్లాడబెట్టుచున్నది. వానిని నిర్జించు నుపాయమా; యెవరికిని దోచకున్నది. ఇకచేయవలసినదేమి? కడుసుకుమారియు, మహాసాధ్వియు, రాముని దేవేరియునగు సీతామహాదేవి భారతీయుల బాములు

గనలేక రావణునివశమై దశమాసంబులు చెఱసాలక్లేశంబు లనుభవించినది. అహో! ఒక్క స్త్రీయొక్క నిర్బంధమెట్టి మహాచ్ఛక్తి నుద్భవింపజేసెనో కంటివా? నరవానరులేకమైనారు. ఖగమృగాదులుతోడైనవి. సురలు, తాపసులు ఆశీస్సులొసగినారు. రావణుని నిరంకుశ పరిపాలనమున గాసిల్లుజనులకు క్షణములో విభీషణుని చల్లనిపరిపాలనమబ్బినది. ఈపరిణామమునకు హేతుభూతురాలెవరు? చెఱబడిన సీత.

ద్వాపరయుగమున కారాగారములందు నిర్బంధింపబడినస్త్రీలకు లెక్కలేదు. ఒక్క నరకుని కారాగారముననున్న యువతులే పదునారువేలు. ఇక కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు, పౌండ్రకవాసుదేవుడు మున్నగు రాజుల చెఱసాలలయందెందఱు నారీమణులు చెఱబెట్టబడియుండిరో వివరింపనశక్యము. ఇంతమంది నారీమణులు చెఱసాలలబడి మొఱ్ఱో యని మొఱబెట్టుచుండ ఆ ర్తజనచింతామణియగు భగవంతుడు వారి గోడుదీర్పకుండ నెట్లుండును? కాన ఆస్త్రీలచెఱను బాపుటకు చెఱయందేయుదయించినా డాకళాసూరుడు. అతడే శ్రీకృష్ణుడు. దేవకీగర్భశుక్తిముక్తాఫలము. తపస్వినియగు దేవకి శ్రీకృష్ణుని ప్రసవింపగనే కారాగారపుగడియలు తమంతవిడివడెనట! అవును. ఎప్పుడు దానికి ప్రతిక్రియసేయగల నాయకు డుదయించెనో అప్పుడు వానిగడియలు సడలినట్లేగదా. కాని యిది యొక్క శ్రీకృష్ణుని తోడనే కాలేదు. సమరతంత్రప్రవీణయగు సత్యభామ విల్లునంబులుచేబూని మగనికి బాసటయైనిల్చి నరకునితో బోరాడినతరువాతనే పదునాఱువేలరాచకన్నెలు చెఱనుండి విముక్తలైరి. స్త్రీలసహాయము పురుషులానాడును బడసిరనుటకు సాత్రాజితిసమరమే తార్కాణము.

యుగయుగములందును పరిపాటియైనచెఱసాలవాసముకలియుగమునమాత్రము స్త్రీల కెట్లుదప్పును? స్త్రీలు చెఱబడినగాని లోకమునకు వెట్టగలుగదు. రూపెత్తిన సహనమును, పుంజీభవించిన సాహసమును, పవిత్రతేజోరాశియునగు భారతమహిళాసంఘముయొక్క పరిపూర్ణసహాయము పరాధీనభారతమునకు మరల కావలసివచ్చినది. మహాత్ము డర్థించినాడు. స్త్రీలు సరేఅనినారు. చదువురాదు. రాజకీయములెఱుగరు. మతనిర్బంధమెక్కువ. సంఘముయొక్కఆక్షేపణ లత్యధికము. ఇంటిలోనికాలు బయటపెట్టుటకు వీలుకాని సాంసారికమైన చిక్కులు. పిల్లలసంరక్షణబాధ్యత. పరపురుషులయెదుటబడనివారు కొందఱు. పరదాల చాటుననేకాలక్షేపముచేయువారుకొందఱు. పేరంటమునకై నపొరుగిల్లెఱుగనివారుకొందఱు. ఎండకన్నెఱుగని యట్టి శుద్ధాంతకాంతాజనంబులందు, ఈసుమకోమలహృదయులందు దేశహితైకకాంక్ష నివురుగప్పిననిప్పుచందమున మునుపేగర్భితమైయున్నదో, మహాత్ముని తేజోబలముచే నప్పటికప్పుడే యుద్భూతమైనదో తెలియదు. సుమమువలె కోమలులును, జలమువలె పవిత్రలును, వహ్నివలె నుజ్జ్వలలునునగు సోదరీమణులు తండోపతండములుగ సత్యాగ్రహదళమునజేరి మహాత్మునియాదేశము నిర్వర్తించి చెఱసాలలలో ప్రవేశించినారు. ఆసేతు

శీతనగపర్యంతంబైన యీఆర్యావర్తమున ఈయుద్యమముచొరనిప్రదేశములేదు. సర్వరాష్ట్రముల స్త్రీలిందు పాల్గొనుటయే యిందులకు నిదర్శనము. ఈశాంతిసమరకార్యక్రమము నిర్వహించుపట్ల నొక్కొకచో ఈస్త్రీల మృదులశరీరములు దండప్రహారంబులకును, పాణిపల్లవంబులు బలత్కారాకృష్టంబులకును, దీర్ఘశిరోజంబులు పరిభవపీడనంబునకును గుఱియైనవి. కాని వారు వెనుదీయలేదు. ఎక్కడెక్కడ దౌర్జన్యము విస్తరించిన నక్కడక్కడ తాము పాడనూపి లాఠీప్రయోగంబులకు విరామంబు కల్పించి శాంతిస్థాపనము చేయగలిగినారు. కాన యిది మహిళాశకమని వాక్రుచ్చుటలో మహాత్ముడు యదార్థమునే ప్రకటించెను. కాని యీశకనామమును నిలువబెట్టుకొనుటకు స్త్రీలపై నింకను విశేషమైన కార్యభారము నిలిచియున్నది.

మహాత్ముని హెచ్చరిక చక్కగా పరికించితివా? ఆయన ప్రశంసలోనే పిలుపునుడి వినబడుచున్నది. ఇకముందు జరుగువలసినది యొడంబడికకు బద్ధమైన ప్రచారము. మునుపే అహింసావిషయమున నియమవ్రతులైనవారీయొడంబడిక కారణమున మఱింత సహనమును చూపవలసియున్నది. క్షమాసంపత్తికి పేరుమోసిన నారీమణుల కీకార్యము నొప్పగింప మహాత్ముడు కుతూహలము జూపుచున్నాడు. ఆయన అభీష్టమీడేర్చుటకు అప్పుడే వందలకొలది దేశసేవిక లుత్సాహముతో ముందంజవేసి సిద్ధమగుచున్నారు. కాని మిత్రమా! రథసారథ్యమెట్టిదో ఉద్యమసారథ్యముగూడ అట్టిది. రథమును పడివడిగా నడపుటయేగాని నిలుపుటచేతగాని వాడేవిధముగా ఉత్తమసారథియనబడడో తీవ్రప్రబోధముచే ప్రజలను రెచ్చగొట్టుటయేగాని శాంతపఱచుటచేతగాని నాయకులును నటులనే నిందింపబడుదురు. మఱియు విశాలమగు రాచబాటలపై పరువులెత్తించినట్లు యిరుకుసందుల రథసారథ్యము సేయుటయు సుకరముగాదు. నేడు మహాత్ముని సత్యాగ్రహరథము ఒడంబడిక యను యిరుకుసందులప్రవేశించినది. మునుపటివలెపేరెములెత్తించుటకిందు వైశాల్యములేదు. కాన యిందు రథము తేలికగానుండవలయును. చక్రములు సున్నితముగానుండవలయును. వాహనములు ధూర్తములుగాక యుండవలయును. సారథి చతురుడుగానుండవలయును. ఈశ్వరానుగ్రహమువలన మనసోదరీమణులీపథమునగూడ నేర్పుగానడచి విజయశ్రీనిబడసెదరేని వారును వారిసహాయమర్థించిన మహాత్ముడును జగన్నుతకీర్తిగాంతురు. పారతంత్ర్యాంధకారనిమగ్నమైన భారతజాతికి స్వాతంత్ర్యభానుని సందర్శనభాగ్య మబ్బును. కల్పలతా! ఈ సందర్భమున మన ఆంధ్రసోదరీమణులు పెక్కండ్రు సత్యాగ్రహసమరమునజేరి చెఱసాలవాసాదిక్లేశంబులు పెక్కులనుభవించియు సుఖముగా వచ్చినందులకు భగవంతున కనేక వందనములు. యశోవిరాజితలైన యానారీరత్నములకు మన సుస్వాగతము.

భావపురి
౧-౮-౩౧

ఇట్లు,
శారద.

# మంగళస్నానాలు

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి.యల్.

౧

మంగళస్నానాలె మాతల్లి! నేడు
నిత్యకళ్యాణమా నీపెళ్లిదినమె.
అరుగునే సుముహూర్త మాలస్యమైన,
జానకీ! రావమ్మ! స్నానంబుచేయ.

౨

శృంగారమానీదు బంగారుమేన
పసుపెంతొ పచ్చగా పట్టునేతల్లి!
పసుపుపచ్చగరాసి పరిమళముపూసి
కళ్యాణతిలకంబు కై సేతునమ్మ!

౩

చూడవచ్చినవారి వేడుకల్ దీర
పెండ్లాడు నీబావ ప్రేమంబుమీర
మురువుగుల్కెడు సొగసుముస్తాబుతోడ
పెళ్లిపీటలపైకి వెళ్లవలెనమ్మ!

౪

మాతల్లి! మొగమందు లేతచిరునవ్వు
లాడంగ, కన్నులందనురాగమొలుక,
చిన్ననాడేచూచి యెన్నుకొన్నట్టి
నల్లనికృష్ణునే పెళ్లాడుమమ్మ!

౫

నీయత్తరాగంబు, నీమామమంచి,
నీదుకృష్ణునిప్రేమ, నీరూపురేక,
నీపెళ్లివిభవంబు, నీయదృష్టంబు
జానకమ్మా! లేవె జగతిలోనెందు.

౬

బాల! వెల్గొందు నేవేళ నీకంట
వినయసౌశీల్యంబు విమలప్రణయంబు,
అమ్మ! చెల్వొందునేనాడు నీయింట
బహుళకళ్యాణంబు పచ్చతోరణము.

౭

పూతచారిత్రయా సీతమ్మవోలె,
సఖునిబ్రతికించిన సావిత్రివోలె
పుట్టినింటికి కాలుపెట్టునింటికిని
అసమానమాకీర్తు లార్జింతువమ్మ!

౮

బుధుడుప్రేమముతోడ బుద్ధినీకిచ్చు
అంగారకుడునీకు మంగళంబిచ్చు
సూర్యభగవానుఁడు సుఖమునీకిచ్చు
జగదీశ్వరుఁడు నీకు సౌభాగ్యమిచ్చు.

౯

నీసౌకుమార్యంబు మాసౌఖ్యమమ్మ!
నీకంటిలోనీరు మాకష్టమమ్మ!
నీపుణ్యశీలంబు మాపూజలమ్మ!
నీయశోవిభవంబె మాయాయువమ్మ!

౧౦

సంతానమోదాలు, శాంతిసౌఖ్యాలు,
సకలసౌభాగ్యాలు సమకూఁతు తల్లి!
హాయిగానీస్నాన మాయెమాయమ్మ!
పెళ్లిపీటలపైకి వెడలిరావమ్మ!

# ప్రాణాధికం

కె. కుటుంబరావుగారు

(భారతమహిళా సతీత్వమును ప్రదర్శించు చక్కని చిన్నకథ)

రంగారావూ, అతని బావమరిదీ ఇంటిముందు బయలులో రెండుకుర్చీలమీద కూర్చున్నారు. రంగారావు కనుబొమలు ముడిచి దీర్ఘమైన ఆలోచనలోపడ్డాడు. రామమూర్తి లేచి పచారుచెయ్యటం మొదలు పెట్టేడు. రెండునిమిషాలు గడిచింది. రామమూర్తి అకస్మాత్తుగా రంగారావుముందాగి "మాచెల్లెలు అంత అధైర్యపడ్డానికి కారణంలేదు" అన్నాడు.

రంగారావు దీనంగా చిరునవ్వునవ్వేడు.

"ఆమాట నీచెల్లెలికి నచ్చచెప్పు. చూతాం! ఎవరోగుండెజబ్బుతో పోయినారట. తానుకూడా పోవలసివస్తుందని ఒకటే బెంగ. పైగా బాధ ఒక్కరవ్వ భరించలేదు. సాధారణంగా నొప్పి భోజనానంతరం కాని, కొంచెంశ్రమపడితే కాని వస్తుంది. ఒకరోజున ఎంతగోలచేసిందనుకున్నావు? నేను చాలా భయపడ్డాను. చివరకు నవ్వి ఎక్కువబాధలేదన్నది."

రామమూర్తి తలఊపేడు. "నేనెరుగుదును. దానికి మొండితనంకూడా జాస్తి."

"జాస్తీ గీస్తీ ఎరగనే! డాక్టరును పిలుస్తానన్నాను. డాక్టరు గుండెపరీక్షించాలంటాడని వద్దన్నది. ఏదైనా మందిస్తే తాగుతానంటుంది. కాని నాకు నమ్మకంలేదుసుమా!"

"తాగదు. నేనెరుగుదును."

"ఇంకొకడాక్టరు ఇష్టంలేకపోతే నిన్నుపిలుస్తానన్నాను."

"నన్నుచూస్తే దానికి గురిలేదు. నేనొకవేళ మందిచ్చినా దానికి వంటపట్టదు."

"ఆమాటే అన్నది. నాకేమీ తోచటంలేదు.''

"కాకపోయినా నిన్నుచూస్తే దానికి బొత్తిగాభయంలేదు, బావా! ఎంతఆపేక్షఅయినా అంతచనువు పనికిరాదు."

రంగారావు మళ్లీ నవ్వేడు. "చనువిచ్చినందుకు నాకు పశ్చాత్తాపంలేదు. ఇప్పుడు పశ్చాత్తాపపడీ కార్యంలేదు. దీనికేదో ఉపాయం ఉండాలి. నేనెరిగినంతవరకూ అది మందుపుచ్చుకునేమార్గం కనిపించలేదు. నానాటికి రోగం ఎక్కువవుతూంది.''

రామమూర్తి కొంచెం ఆలోచించేడు.

"పోనీ శకుంతలకు ఫలానిడాక్టరు చాలగట్టివాడని అభిప్రాయముందా?"

"లేకేం? శేషాచలపతి చాలాకేసులు నయంచేశాడు గుండెజబ్బువి. అది దానికి తెలుసును."

రామమూర్తి సంతోషంతో "ఇంకేం?" అన్నాడు.

* * * *

ఆరాత్రి భోజనాలసమయంలో రంగారావు భార్యజబ్బుసంగతి తెచ్చేడు.

"అన్నట్టు ఈ ఊళ్లో గట్టిడాక్టరుండాలే. శేషాచలపతిగారని. ఎరుగుదువా? బావా?"

"అవునురా?" అన్నాడు రంగారావు అనుమానిస్తూ.

"ఆయన కొన్నికేసులు నయంచేశాడు. కాని ఆయన గుండె పరీక్షించకుండా మందివ్వడు" అన్నది శకుంతల.

"అవును. పరీక్షించనీ. పరీక్షించకుండా ఏ డాక్టరూ ఇవ్వడు!" అన్నాడు రామమూర్తి.

"నాకక్కరలేదు!" అన్నది శకుంతల తుటారిస్తూ.

"అదేమేవు?" అన్నాడు అన్నగారు ఆశ్చర్యంలో.

"నాకుపరీక్షలూవద్దూ పాసలూవద్దూ."

"వద్దకపోతే జబ్బెలా నయమవుతుంది?"

"పోనీలే! నయంకాకపోతే భయంలేదు."

"బాధపడగలవా?"

"ఇప్పుడు పడ్డంలేదూ?"

ఆమెకు సమాధానం చెప్పడం సులభంకాదు.

* * * *

ఆరాత్రి పడుకోబోతూ రంగారావు భార్యనుపిలిచేడు. శకుంతలవచ్చి అతనిపక్క నేకూర్చుంది. రంగారావు భార్యతల చేత్తో నిమురుతూ "నాకెంత కష్టంగాఉందో తెలుసునా? పిల్లా!" అన్నాడు.

"ఎందుకు?" అన్నదిభార్య ఆదుర్దాతో.

"నీకుప్రాణభయంలేకపోతేమాత్రం నాకోసరం మందుతాగకూడదా?"

శకుంతల మాట్లాడకుండా తలవంచుకుంది.

"పోనీ నీకిష్టంలేకపోతే" అన్నాడు రంగారావు నిట్టూర్పువిడిచి.

శకుంతల చిరునవ్వుతో తలఎత్తి "నేను మందుతాగుతాను. డాక్టరును నాచెయ్యిఅయినా తాక నివ్వను. ఈ ఒక్కవిషయంలోనన్ను క్షమించండి" అన్నది.

"ఒకవేళ జబ్బు అపాయకరంగా వచ్చేటట్టయితే నన్నువిడిచిపెట్టిపోతావా?"

"నా కాభయంలేదు. నేనుచచ్చిపోయినా మీదగ్గిరే ఉంటాను!"

"మరి నా విషయం? నిన్నువదిలి నేనుండగలనా?"

శకుంతల సమాధానంచెప్పకుండా రంగారావును చప్పున ముద్దుపెట్టుకొని వెళ్లిపోయింది. రంగారావు ఒక్కనిట్టూర్పువిడిచి ఊరుకున్నాడు. ఏమి జరగాలిసిఉందో?

* * * *

మర్నాడుఉదయం రామమూర్తి శేషాచలపతిగారితో మాట్లాడివస్తానని వెళ్లేడు. రంగారావుకు రామమూర్తివల్ల లాభంలేదని తోచింది. పదిగంటలకు రామమూర్తి సీసాతో మందు తెచ్చేడు.

"శకుంతలా! శేషాచలపతిగారు మందిచ్చేరు. దీనితోనే ఆయన చాలా కేసులు నయంచేశారట. ఇప్పుడొకడోస్సు పుచ్చుకో."

శకుంతల మందుసీసా తీసుకుని "తాగుతాలే" అన్నది.

"ఇప్పుడుతాగు!"

శకుంతల బలవంతంగా గంటసేపు అనుమానించి చివరకు మందుతాగింది.

రామమూర్తి రంగారావుదగ్గిరికి వచ్చేడు.

"ఏమన్నారు చలపతిగారు?" అన్నాడు రంగారావు.

"చలపతిగారూ లేదూ, ఏమీలేదూ" అన్నాడు రామమూర్తి నవ్వి.

"మందు?"

"నాదే"

"పనిచేస్తుందా బాగా?"

"మందుమంచిదేలే. కాని నెలరోజులైనా వాడాలి"

"అంతవరకూ బాధపడుతూంటుందా?"

"పదిహేను ఇరవై రోజులు"

"చచ్చేం!"

"ఆమాత్రంలేకుండా నా?"

"నే నదిపడేబాధ చూడలేనునుమా"

"చూడు. ఈ బలహీనత ఉండరాదు. ప్రతివాడు తప్పనిసరిగా కొంత డాక్టరీ చదవాలని నా అభిప్రాయం. అప్పుడు నువ్విలాఅనవు!"

"నీసంస్కారణ అలాఉండనీ. అది పడేబాధలో ఒకపాలు నటన. అదైనా లేకుండాచేస్తూ. అనటన, పాపం, కావాలనికాదు. బొత్తిగా ఓర్చుకోలేదు. ఇలాంటివి చిన్నతనంనించీవస్తాయి."

రామమూర్తి కొంతసేపు ఆలోచించేడు.

"నేను నీకు చేస్తూన్న సహాయానికి సలహాకూ వందరూపాయలుఫీజు పుచ్చుకోవచ్చును. ఉపాయం చెబుతా వినూ."

* * * *

రామమూర్తీ, రంగారావూ భోజనంచేశారు. శకుంతల రామమూర్తి సలహాప్రకారం కొద్దిగాభోజనం చేసింది. మామూలుప్రకారం గుండెలోపోటు సన్నగా ప్రారంభమయింది. రంగారావుకు తాంబూలంఇచ్చి మరీ అంట్లు శుభ్రంచేద్దామని శకుంతల అకులూ, పక్కలూ పట్టుకునివచ్చింది.

రంగారావును చూడగానే ఆమెగుండె జల్లుమన్నది. అతను మంచంమీద ఆటూ ఇటూ పొర్లుతున్నాడు. అతనిముఖం వికారంగా మారిపోయింది.

శకుంతల భయంతోవచ్చి రంగారావుమంచంపక్కన మోకరించి "ఏమిటిది?" అన్నది గొంతుచలిస్తూ.

"ఏమీలేదు" అన్నాడు రంగారావు మామూలుగా ఉండాలని ప్రయత్నిస్తూ.

"చెప్పరూ?" అన్నది శకుంతల భర్తచెయ్యిపట్టుకుని.

"గుండెలో బరువుగా ఉన్నది." అన్నాడు రంగారావు బలవంతంగా మాట్లాడుతూ.

"మీకన్నూడానా?"

పదినిమిషాల్లో రంగారావు మామూలుస్థితికి వచ్చేడు. అతను మంచంలోలేచికూర్చుంటూ "డాక్టరు దగ్గిరికి వెళ్లివస్తా నిప్పుడే!" అన్నాడు.

"మీరు కాస్సేపు పడుకోండి. మా అన్నయ్య వెళ్లివస్తాడు."

"డాక్టరు పరీక్షచేస్తాడు"

"కొంచెంసేపు ఉండి పోదురుగాని"

ఆ సాయంత్రం రంగారావు సీసాతో మందు తెచ్చుకున్నాడు.

* * * *

"నామందులాలేదే?" అన్నది శకుంతల.

"నా ఊపిరితిత్తులుకూడా సరిగాలేవని ఇంకేదో మందిచ్చేడు. నేనీ మందు తాగలేనునుమా."

"ఎప్పుడెప్పుడు తాగమన్నాడు డాక్టరు?"

"ఉదయం సాయంత్రం ఆరుగంటలకు"

*   *   *   *

ఆరుగంటలకు శకుంతల టొమ్బ్లరులో రంగారావుమందు పోసుకొచ్చింది.

"ఏమిటది?" అన్నాడు రంగారావు అనుమానంతో.

"మీమందు" "తాగుతాలే" "ఇప్పుడుతాగండి"

"ఈపూట బాధగాలేదులే. ఈసారి బాధవస్తే తాగుతాలెస్తూ."

"కాదు, నేనుకూడా తాగుతానుగా. నన్ను చంపుకున్నట్టే తాగకపోతే."

రంగారావు మందు తాగేడు. శకుంతలా తాగింది.

ప్రతిపూటా రంగారావుకు భోజనానంతరం గుండెలో పోటువస్తూనే ఉంది. శకుంతల ఆతనిబాధతో తనబాధ మరిచిపోతోంది. అతన్ని మందుతాగించటానికి తనుకూడా శ్రద్ధగామందుతాగుతోంది. రంగారావు ఏపూటకాపూట చాలా మొండితనం చేసేవాడు. ఇరవై రోజులు గడిచింది.

"నాకీపూట నొప్పిరాలేదు నుమండీ!" అన్నది శకుంతల.

రంగారావు కనుబొమలు ముడేసి గుండెలు రుద్దుతూ "నాకూ ఎక్కువబాధగాలేదు. ఇకమందు మానేస్తాను" అన్నాడు.

"వద్దు! వద్దు!" క్రమంగా శకుంతలరోగం, రంగారావు దొంగరోగం నయమయినాయి.

*   *   *   *

చివరకు రంగారావు నిజంచెప్పేడు.

"అమ్మా! ఎంతవారూ!" అన్నది శకుంతల ఆశ్చర్యం నటిస్తూ. "ఇకమీమాట ఒక్కటైనానమ్మను."

"మంచిదే.కాని ఈ పూట తలపగలేస్తున్నది. ఎందుచేతనో?"

"పాపం! అమృతాంజనం పట్టుకురానా?"

రంగారావు నవ్వి శకుంతలను రెండుచేతులుపట్టుకొని దగ్గిరికి లాక్కుని "పిచ్చిపిల్లా!" అంటూ ముద్దు పెట్టుకున్నాడు.

## చిన్నికృష్ణ!

యేలేశ్వరపు వేంకటకృష్ణమూర్తి గారు

ధరణి దేవకి గర్భంబుదాల్చినిన్ను
ధరను నునిచిన దాదిగా, కరములందు
వెన్నముద్దలుదొంగిలి వేడ్కతోడ
గొల్లపిల్లలతోఁగూడి చల్లగాను
చిన్నబొజ్జనునింపెడు పిన్నబాల!
సేవఁజేయుదు రారమ్ము చిన్నికృష్ణ!
బాలురందరనోడించి బాగుమీఱ
నాటలందున నేగెల్చితంచునిలువ

పల్లవాంచితమృదులసత్ పంకజంబు
లనఁగనొప్పెడు పాదంబులపుడు నీకు
నెంతనొచ్చెనో! గోపాల! నెవరికెఱుక?
సేవఁజేయుదు రారమ్ము చిన్నికృష్ణ!
చేతులారఁగ నిన్ బూజసేతునేని
పరమపదమునుజేఁబట్టవచ్చునంచుఁ
జెప్పుదురుపెద్దలిలగాన చిద్విలాస!
సేవఁజేయుదు రారమ్ము చిన్నికృష్ణ!



"వచ్చి ముద్దీయవే వరహాలతల్లి!"

*Photo by Messrs M. Doss & Bros., Madras.*



బాలతపస్విని.

*Photo by Messrs M. Doss & Bros., Madras.*

# రూపపటమెందుకు?

శ్రీమతి పాకలరత్నాబాయిగారు

"శారదా! నీపరీక్షసంగతి తెలిసినదా?" అని కమలం యింట్లోకివస్తూనే ఆత్రంగా అడిగింది.

"ఆ. తెలిసినది, కాని ముందునీవుకూర్చో. తరువాత సావకాశంగాచెబుతా"నన్నది శారద జడవేసుకుంటూ, గదిలోంచి.

"అయితే, ఏమైందోచెప్పు త్వరగా."

"అబ్బా! అంతతొందరెందుకే నీకు? ఈసారి నాపరీక్షగుడ్డు" అంది నవ్వుకుంటూ.

"ఆ. ఏమిటే? నీపరీక్షపోవడమా? అంతా అబద్ధం."

"నిజంగానే. కావలిస్తే మాఅమ్మనడుగు. నేను స్నానంచేసి యిప్పుడేవస్తా" అని శారద లోపలికి వెళ్లి పోయింది.

ఇంతట్లోకే సుందరమ్మగారు మెల్లిగాఅక్కడికివచ్చి కమలాన్నిచూచి "కమల!ఎప్పుడు రావటం?" అంది.

"నిన్ననేనండి. పండుగకు మానాన్నగారు తీసుకొచ్చేరు."

"అయితే, ఎన్నిదినాలుంటావు?"

"ఈసారి నాలుగైదునెల లుండమంటున్నారు."

"అమ్మా! మీ రదృష్టవంతులండీ. చిన్నతనంలో పెండ్లిచేసినా పుట్టినింటికిరావడం చాలారోజులువుండటంవుంది. మాలో పెండ్లిఅయితే అత్తవారిల్లేగతి. వారిదయగలిగి ఎప్పుడైనాపంపిస్తే పంపిస్తారు. లేకుంటే లేదు."

"అమ్మయ్యో! అలాఅయితే చిన్నప్పటినుండి కనిపెంచినవాళ్లనిచూడకుండావుండటం కష్టంకదూ?"

"కష్టమైనా తప్పదు. ఏంచేస్తారు పంపించకపోతే."

"అలాఅయితే మీ శారదకప్పుడే పెండ్లిచెయ్యకండి."

"అలాగేలే. నాకు పనుంది వెడతా. మీరు మాట్లాడుకోండి."

రమణారావుగారు వెలమకులస్థులు. బాగాడబ్బుగలవాళ్లే. ఆయనభార్య సుందరమ్మ. వీరికి శారద, రామమోహనరావు వీరిద్దరే పిల్లలు. ఇద్దరుపిల్లలూ చాలా తెలివిగలవాళ్లు. రామమోహనరావు బి. యల్. పరీక్షకు చదువుచున్నాడు. శారద థరుడుఫారంవరకూ స్కూలికివెళ్లి చదివింది. తరువాత స్కూలుమానిపించి ఘోషాలోపెట్టేరు. మరి వెలమలు కదూ! ఘోషాఎక్కువ. దానివల్ల ఇంట్లోవుండి పుస్తకాలు చదువుకోడం, పనిపాటలునేర్చుకోడం మొదలుపెట్టింది. ఒకసారి వార్తాపత్రికలో నరసాపురంపరీక్షవిషయమై ప్రచురించి

వుండగా చూచి సంతోషించి వెంటనే తల్లిదండ్రులను ఒప్పించి పరీక్షకుచదివింది. అందులో జయముపొంది బంగారుపతకముబడసినది. కమలం శారద ప్రక్కయింటిపిల్ల. వారు బ్రాహ్మణులు. బాగా డబ్బుగలవాళ్లే. అయినా సంఘానికిలోబడి కమలానికి చిన్నతనంలోనే వివాహంచేశారు. కమలం, శారదా చిన్నప్పుడుకలసి చదువుకున్నారు. అందుకనివాళ్లిద్దరికిచాలా స్నేహం. కమలం పెద్దదయ్యాక అత్తగారింటికి వెళ్లింది. పుట్టినింటికివచ్చినప్పుడు రోజూ శారదయింటికివచ్చి మాట్లాడుతుంది. శారద పరీక్షసంగతి తెలుసుకోవాలని కమల తొందరగావచ్చిఅడిగింది. కాని శారద తమాషాగా గుడ్డుఅంది. సుందరమ్మగారు వెళ్లగానే శారద బొట్టుపెట్టుకుని మెళ్లో నెక్లయిసు వేసుకుంటూవచ్చి కమలందగ్గర కూచుంది.

"ఏమే! శారదా! చెప్పవూ?"

శారద నవ్వుతూ ఒకకార్డు కమలాని కిచ్చింది. అదిచదివి కమలం సంతోషముతో "అయితే ఫోటో పంపించావా?" అంది.

"లేదు."

"ఎందుకని పంపలేదు?"

"ఎందుకనా? ఘోషా. ఘోషాఅంటూ యింట్లో కూర్చుని ఎవ్వరికీకనబడకుండా వుండీ చిత్రపటమూలంగా లోకానికి వెల్లడిచేసుకోవడం నాకిష్టంలేదుసుమా?"

"చాల్లే. నేను చెప్పేదివిను. నీవు ఘోషాపద్ధతిని ఇంటియందుండి కృషిచేసి అందు ఫలితమునొంది దానిచే కీర్తివడసి యాకీర్తిచంద్రికల వ్యాపింపజేయుటే గొప్పవిశేషము. నీవు ఘోషాపద్ధతి నవలంబించినచో నీకీర్తిగూడ ఘోషాగా మూలకూర్చుండునా? నీరూపమెవరికిని గోచరము కాకున్నను నీకీర్తితార ఎవరికిని తెలియకుండా ఉండునా? కీర్తినెవరు వ్యాపింపజేయ నవసరములేదు. అదియే వ్యాపించును. జనులు ప్రసిద్ధులైనవారిపేరు విన్నంతనే రూపమెట్లుండునో యని తలంతురు. ఛాయాపటముగూడ నున్నచో చూచి సంతోషింతురు. ఘోషాపద్ధతిని తొలగింప నాంధ్రరాష్ట్రీయమహిళాసభ వారు ప్రయత్నించుచున్నట్లు నీకు తెలియదా? స్త్రీవిద్యావ్యాప్తికి, దేహారోగ్యమునకు, లోకజ్ఞానమలవడుటకు ప్రతిబంధకమైన ఘోషాపద్ధతిని దొలగించు టత్యవసరమని ఆసభవారు నొక్కివక్కాణించుచున్నారు. నీకిదియంతయు తెలుసునుగదా? కనుక తప్పక ఫోటోపంపించు."

"ఓహో! నీవు కవయిత్రివై పోవుచున్నావు. అబ్బా! ఎంత ఉపన్యాసమిచ్చేవు?"

"మరి నీకు తెలియనప్పుడు చెప్పవద్దూ? నీవింతచదువుకున్న దెందుకు?"

"ఎందుకా? జ్ఞానముకొరకు. అంతేగాని పత్రికల్లో పటమేసుకోవాలనిగాదు."

"సరేగానీ ఫోటోవేసుకుంటే తప్పేమిటో చెప్పు. ఇప్పుడెందరో విద్యావతులువేసుకుంటున్నారుకదా వాళ్లంతా తెలివితక్కువవాళ్లనా నీఅభిప్రాయం?"

"అది కాదే. వాళ్లు వేసుకుంటే ఫరవాలేదు. కాని ఘోషాలోవున్న-అందులోనావంటి వాళ్లు-వేసుకుంటే చాలా అసహ్యంగా వుంటుంది."

"నీవు చదువుకున్న దానవుకదా. ఇంకా ఎన్నాళ్లీ నిర్బంధవిధానంలోఉంటావు? చెప్పు. మళ్లీ దేశసేవఅంటూ మహాకబుర్లుచెబుతావు. పరదాలోవుండి నీవు చేసే దేశసేవఏమిటి?"

"ఓస్! పిచ్చిదానా! దానికా? కఱ్ఱపట్టి పశువులనుకాచిన నారీమణియే కత్తిబట్టి కదనరంగమున కుఱికినది. గృహలక్ష్మిసంక్రాంతిసంచిక చూడు. రమణమ్మఎవరు? ఆలోచించి నచో మాలో నెందఱు వీరనారులు గలరో నీకు తెల్లముకాగలదు. సమయమువచ్చినప్పుడు ప్రాణములనుతృణప్రాయములుగనెంచి అశువులబాసినవీరాంగనలెందరోమాలోగలరు.అప్పుడు పరదా వారినడ్డగింపజాలియుండలేదు. శౌర్యము వారి కుగ్గుపాలతో నేర్పినది. నేనుచేసేదేశ సేవ ఇపుడత్యల్పము. కాని కాలక్రమమున హెచ్చుగచేయగలను. కాని ముందు స్త్రీలకు విద్యయెక్కుడవసరము. కావున మనమిరువురమునుజేరి కొందఱుస్త్రీలనుచేర్చి నరసాపురపు పరీక్షకు చదివించామంటే చాలును. అల్లే స్త్రీలు ఉన్నతవిద్య బడయగలరు. ఉన్నతవిద్యా భ్యాసము లేనంతదనుక స్త్రీలు పురుషునిచేత విలాసవస్తువులు మాత్రముగనే యుందురు. భారతదేశము బాగుపడవలెనన్న మున్ముందు స్త్రీవిద్యాభ్యాసము చేయవలెను. అప్పుడే భారతమాత ధన్యతనొందగలదు. మన హైందవనారీమణు లున్నతదశకువచ్చినచో నదియే పదివేలు. వారికీర్తిచంద్రికలను వెదజల్లుటకు ప్రయత్నింతము. ఇదియే మన మొనర్పవలసిన పని. కాని రూపపటప్రకటనముగాదు.

## సుప్రియ

శాంతి బాలకృష్ణమూర్తిగారు

కఱవు శ్రావస్తిపురముఁ జీకాకుపఱుప
నాతురత శిష్యులం బుద్ధుఁడడిగెనిట్లు:
"కడుపుఁగాలినవారికి గంజివోయఁ
గల దయాళులు మీలోనఁగలరటయ్య?"

* * *

"నాకుఁగల సర్వభాగ్యమంజకరొసఁగుదు"
ననియె రత్నాకరుండను ధనికుఁడొకఁడు—
"ఇందఱకు బువ్వఁబెట్ట నాయింటలేదు.
నాదురక్తమ్ము సంతర్పణమొసర్తు"
ననియె సేనాని జయసేనుఁ డనెడువాఁడు—
"వానలాలేవు! పంటనిప్పచ్చరమ్మ!
పన్ను చెల్లక లిప్పలఁబడుదు" నంచుఁ
బీదపలుకాడె నాయూరి పెద్దకాపు
ధర్మపాలుఁడు నిట్టూర్చి దైన్యమునను.

* * *

కడఁగి సుప్రియయను బిచ్చకత్తెబిడ్డ
వినయమున నెల్లరకు మ్రొక్కియనియెనిట్లు:
"ఆఁకలిఁ దీర్తునేన అన్నాతురులకు."
"పొట్టకేలేని నీవెట్లు పెట్టఁగలవు?"
అనుడు వారికి సుప్రియ యనియెమరల:
"పేదనేయగాదు; నావంతు పిడికెడేని
దొరకకుండదుసుండి మీయిరవులందు."

—రవీంద్రుడు.

# గోడమీద ప్రతిబింబము

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

నిన్నటిరోజు మాయింట విందుజరిగింది. భోజనానంతరము మాయింట జరిగిన ఒకవిచిత్రవిషయమును గురించి తలచుకొనునప్పుడెల్ల నాకు అవమానము, ఒడలు పులకరింపును కలుగుచున్నవి. నాకు కలిగిన ఊరట యితరులు కూడ ఈ పులకరింపునందు పాల్గొనినారనుట మాత్రమే. వినుచున్నకొలది ఆసక్తియు, ఉద్రేకమును కలిగించు దయ్యములు, పిశాచములు వాటిచర్యలనుగూర్చి మేము ముచ్చటించుచున్నాము. మాలో పెక్కుమంది వారికి తెలిసిన కొన్నియద్భుతసంఘటనలగురించి వివరించేము. అవన్నియు మాకంత భయాశ్చర్యముల గొలుపలేదు. మాస్నేహితుడొకడు తనవెంట ఒకనూతనపురుషుని తోడ్కొని వచ్చెను. వాడు నాకు అపరిచితుడు. అతను పొట్టిగనుండెను. పాలిన మొగమును కలిగియుండెను. అతను ఆతురతకలిగిన ముఖముతో మాటలాడుచున్న ప్రతివానిముఖమును ఏదేకదృష్టితో చూచుచుండెనేకాని యేమియు మాట్లాడలేదు. నేను వానినికూడ మాలోకలుపనెంచి వానివైపు తిరిగి "నీవేమైన నీయనుభవములోని యొకవిచిత్ర ఘటనమును గురించి చెప్పగలవా?" యని ప్రశ్నించితిని.

వాడును యొకనిమిష మాలోచించి ఇట్లుచెప్ప మొదలిడినాడు: "అయితే నేను చెప్పబోవునదిమాట సామెతకథకాదు. ఇంతవరకు మీరుచెప్పుచుండిన విషయములవంటిదికాదు. నిజమెప్పుడు కల్పనలకంటె ఉద్రేకమును కలిగించునని నానమ్మకము. నా కీమధ్యాహ్నమే పూర్తియైన యొకానొక యనుభవమును గూర్చి చెప్తాను. రెండుసంవత్సరములకు పూర్వము నేను గోవిందప్పనాయకవీథిలో ఒకప్రాతయింటిలో గదులుతీసికొనియుంటిని. పడుకగదియంతయు చాలచెమ్మగానుండెను. ఈగదిలోనిగోడలన్నియు పూర్వము యీగదిలో కాపురమున్నవానిచే పాడుచేయబడి యుండెను. గదిగోడలన్నియు మచ్చలుమచ్చలుగ ఉప్పు రిసియుండెను. అందులో ఒకమచ్చ అన్నివిధములను ఒక మనిషిముఖమును పోలియుండెను. అదిఅచ్చముగ మనిషిముఖమువలెనే యుండెను. నేను నిద్రబోవునప్పుడును, నిద్రలేచునప్పుడును శ్రద్ధతో ఈ ముఖమునే చూచేవాడిని. చూడగా, చూడగా పూర్వము యీగదిలో అద్దెకుండినవాడు తలచినట్లే నాకును యీ ముఖము నిజముగ కన్పట్టెను. గోడమీది తక్కిన మచ్చలన్నిటికి ఒకానొకప్పుడు భేదముకలిగినను యిది మాత్రము భేదములేక యట్లేయుండెను.

నేనక్కడ ఉండగా తీవ్రవిషజ్వరపీడితుడనైనాను. అప్పుడు నాకేమియు తోచక చదువుకొను టయో, యూరక పడుకొనియుండుటయో చేయుచుండేవాడిని. ఆ దినములలోనే ఆముఖమును చూచిన నాకు మిక్కిలి భయముగొల్పుచుండెను. దానిని చూడను చూడను నిజమని తోచెను. రాత్రింబవళ్లు యీముఖమే నన్ను బాధింపసాగెను. ఆముఖముయొక్క ముక్కునకు ఒకయసాధారణమగు వంపు, కొంచెము వాలియున్న ఫాలభాగము యివియన్నియు విచిత్రముగ కనబడెను. ఈమానవకోటిలో నెవడైనను యిటు వంటి పోలికయుండువాడు ఒకడు యుండకపోవునా యని తలపసాగితిని.

సరి! కొన్నిరోజులకు నాకు స్వస్థతకలిగినది. అయినను ఈముఖము నామీది పట్టువదలలేదు. కొన్ని రోజులకు ఈముఖముయొక్క ఆకారము కలిగిన మనుజునికై వీథులవెంబడి తిరుగనారంభించితిని. ఎక్కడనో యిటువంటి పోలికగల మనుష్యుడు ఉండితీరుననియు, వానిని వెదుకవలయుననియు, నిశ్చయించితిని. ఏమో కాని వానికిని నాకును విధివశమున యేదో సంబంధమున్నదని భయముకలిగినది. అప్పటినుండియు రాజ కీయవ్యాయామసమావేశములకును, రాత్రింబవళ్లు రైలుస్టేషనులకును అవియువియననేల జనము మూగు

చోటులన్నిటికి పోవుచుంటిని. అన్నియు నిష్ప్రయోజనములయ్యెను. ఈయన్వేషణము నాకు పిచ్చిక్రింద మారినది. నేను తక్కిన పనులన్నియు మరచితిని. జనసంకులములగు వీధిమలుపులందు నిలచి పురుషులనుచూచుచుంటిని. ఎంతసేపైనను పురుషులనే. స్త్రీలను నేను కన్నెత్తియైనను చూడలేదు. కొన్నిదినములకు నన్ను పోలీసువారు అనుమానింపసాగిరి. జనులు నన్ను వెర్రివాడని తలపోసిరి.'' అని చెప్పి కొంచెము సేదదీర్చుకొనుటకై యాగినాడు. మేమందరము మౌనముతో ఆతురతగలముఖములతో చెక్కిటచేయి చేర్చివాని ముఖమువంక తదేకదృష్టితో చూచుచున్నాము. మాముందర ఒకదీపము మాత్రము వెలుగుచుండెను. గది యంతయు నిశ్శబ్దముగ చీమచిటుకుమన్నను వినబడునట్లుగనుండెను.

"తర్వాత'' యని మళ్లా మొదలుపెట్టినాడు. "తర్వాత నేను వానిని కనుక్కొన్నాను. వాడు అతి వేగముగ ఒక కారులో మౌంటురోడ్డులో వెళ్లుచున్నాడు. నేను వెనుదిరిగి కొంచెము దూరము పరుగెత్తేను. నా వెనుకనే యొక అద్దెకారు వచ్చుచుండెను. ఆకారును నిలుపమని సంజ్ఞచేసి 'ముందరికారును యనుసరింపు'మని యందులోకి దూకేను. వాడును ముందరికారును దృష్టిపథమున నుంచుకొని కారును శరవేగమున పోనిచ్చేడు. కొంచెముసేపటికి రెండుకార్లు స్టేషనులోనికి ప్రవేశించినాయి. నేను అతిత్వరితముగలోనికి ప్రవేశించేను. ఆనాతిపపురుషుడు యిరువురు స్త్రీలను, ఒకబాలికను తోడ్కొని పోవుచున్నట్లు కన్పడెను. వారు బొంబాయి వెళ్లి స్టీమరెక్కి విదేశములకుపోవుటకు సిద్ధముగనుండిరి. నేనును వానితో మాట్లాడుటకు వీలుచిక్కునేమోయని యచ్చటనే తిరుగనారంభించితిని. కాని యది సాధ్యముకాలేదు. ఇంతలో కొందఱు స్నేహితులువచ్చి వానినికలసికొనిరి. వాళ్లందరుకలిసి బండియెక్కిరి. నేనును వారికంటెముందు టిక్కెట్టుకొనిబండియెక్కి బొంబాయి వెళ్లిబండిదిగువప్పటికి వారుకూడ నాకుపూర్వమే బండిదిగి స్టీమరెక్కి వారికై ప్రత్యేక మేర్పరచుకొన్న గదులలోకి వెళ్లిపోయినారు. వాడు చాల ధనవంతునివలె కన్పట్టినాడు.

మరల నా ప్రయాసమంతయు వ్యర్థమయ్యెను. వాడు ఆ స్త్రీలకు వసతి యేర్పరచి మేడపైకి వచ్చునను ఆసతో నేనుకూడ స్టీమరుమీదికివెళ్లినాను. నాదగ్గర కొంచెముదూరము వెళ్లుటకు మాత్రమే ధనమున్నది. ఆకొంచెముదూరము వెళ్ల నిశ్చయించేను. నేను వానిగదివాకిట నిలబడి వానికోస మెదురుచూస్తున్నాను. ఒక్క అర్ధగంటకాగానే వాడు బాలికతోడ బయటికి వచ్చేడు. నాహృదయముయొక్క తల్లడింపే యీ పడవను కదల్చుచున్నదాయనునట్లు నాహృదయము దడదడ కొట్టుకొనసాగెను. అముఖమును గుఱించి యేవిధమైన పొరబాటునులేదు. అముఖముయొక్క ప్రతిబింబమే యీముఖము. వాడును నావైపు తిరిగిచూచి పైకి నడచిపోవుచున్నాడు. వానితో మాట్లాడుటకు ఇదియే సమయము, యిప్పుడు వీలులేకున్న యికవీలులేదనుకొన్నాను. "నన్ను మన్నించవలెను. మీతో నాకు ముఖ్యమైన పనియున్నది. ఉత్తరప్రత్యుత్తరములు జరుపవలెను. మీ విజిటింగు కార్డు యిచ్చుటకు అభ్యంతరమేమిలేదుకదా?'' యని నాలుకతడబడ గద్గదికతో చెప్పేను. వాడును ఆశ్చర్యముతో నాయభీష్టమును నెఱవేర్చెను. ఆనాలసపురుషుడు మెల్లగ తనజేబులోనించి విజిటింగుకార్డునుతీసి నా చేతికిచ్చెను. వాడు నన్ను బహుశః పిచ్చివానిగాతలచి నాయభీష్టమును నెఱవేర్పకపోవుటకంటె నెఱవేర్చుటయే మంచిదని నిశ్చయించినట్లు నేను అనుకొంటిని.

ఆకార్డును అతిజాగ్రత్తగ చేతితోపట్టుకొని ఆ ఓడలో జనులులేని ఒకమూలకుపోయి చదివినాను. నాకళ్లు కనిపించలేదు. నాతల తిరిగిపోయింది. దానిమీద "గోవిందప్పనాయకర్, వణిజుడు, రంగూన్.'' యని యున్నది. నా శరీరము స్మృతితప్పినది. నాకింకేమియు తెలియలేదు. నాకుబాగుగ జ్ఞానము వచ్చునప్ప

టికి డిశల్ యాసుపత్రిలో ఉన్నాను. అక్కడ కొన్నివారములు జబ్బుస్థితిలోనుండి ఒకనెలరోజుల క్రిందటనే యిక్కడకు వచ్చేను" యని కథకుడు మౌనముదాల్చెను.

మేము యొకరిముఖముల నొకరు చూచుకొన్నాము. పాలిన మొగముకల ఈ పొట్టివాడు చెప్పుకథతో పోల్చిన మాకథలు యెందుకును కొఱగానివి.

"గోవిందప్పనాయికవీధిలోని నాయింటికి తిరిగివెళ్లేను" యని కథకుడు మళ్లా కథయందుకొన్నాడు. "ఈ గోవిందప్పనాయకర్ సంగతి కనుక్కొన్నాను. రంగూనుకు వ్రాశాను. పెద్ద పెద్దవారి సహవాసము చేశాను. నేను కనుగొన్నదల్లా యీ గోవిందప్పనాయకర్, కోటీశ్వరుడు. రంగూనులో నివాసమేర్పరచుకొన్న వణిజుడు. ఇప్పుడు విదేశముల చూచు వేడ్కలో తన సంసారమును తీసికొని వెళ్లేడు. వానితల్లిదండ్రులు మద్రాసులోనే ఉన్నారని. ఎక్కడఅని ప్రశ్నించిన యెవ్వడు బదులుచెప్పలేదు.

నిన్నటివఱకు ఈ విధముగానే గడిచినది. నేను చాలడస్సి పడకమీద పడుకున్నాను. కొంచెము ప్రొద్దుపోయి నిద్రలేచినాను. ఆముఖము అంతస్ఫుటముగ కన్పడలేదు. నేను పొరబడినానేమో యని కనులు తుడుచుకొని మరల చూచేను. సరిగ కనబడదు. నిన్నరాత్రికూడ స్ఫుటముగ కనుపించినది. ఇప్పుడు అస్ఫుటముగ నున్నది. నిన్నరాత్రి ఆ ముఖము మాటాడినట్లుగ తోచినది. ఈరోజు ఆముఖము పూర్వపు ముఖముయొక్క నీడయా అన్నట్లున్నది.

నేను నిర్ఘాంతపోయి పడకమీదనుంచి లేచేను. అప్పటికప్పుడే ఆంధ్రపత్రిక ఉదయపత్రిక వెలువడినది. పత్రికల్లో 'రంగూన్ కోటీశ్వరుని మోటారు ప్రమాదము' యనియుండెను. మీఱుకూడ చూచియుండవచ్చును. త్వరితముగ పత్రిక నొకదానిని కొని నేను చదువవలసిన విషయమును చదివేశాను. దానిలో 'గోవిందప్పనాయకర్, స్నేహితులు విలాసార్థము కారులో దగ్గరయున్న పల్లెకు వెళ్లుచుండగా ఆకారు ప్రమాదవశమున ఒకబండికితగిలి తలక్రిందులైనది. గోవిందప్పనాయకర్ గారు ప్రమాదకరమగుదెబ్బలు తగిలి ఆసుపత్రియందు స్పృహతప్పి పడియున్నారు.' యని యున్నది.

నేను నిర్విణ్ణుడనై నాగదిలోకిపోయినాను. నా పక్కమీదకూర్చుండి ఆముఖమువంక తదేకదృష్టితో చూచుచున్నాను. నేను చూచుచుండగనే ఆముఖము పూర్తిగ మాసిపోయెను. నేను నిశ్చేష్టుడనైనాను. కారణమేమైయుండునా యని యాలోచిస్తూ గదిబయటికివచ్చేను. తర్వాత సాయంత్రముపత్రికలలో గోవిందప్పనాయకర్ గారు ఆదెబ్బవలన చనిపోయిరని తెలిసినది. నాకు అప్పుడు నేను ప్రొద్దున చూచిన విచిత్రమునకు కారణము తెలిసినది. వాడు చనిపోయిన యుత్తరక్షణముననే ఇక్కడిముఖము మాసిపోయినది." యనిచెప్పి కథకుడు కథ ముగించేడు.

మేము చాల అద్భుతముగా ఉన్నదనియు, వానికథ మమ్ములనందఱను స్తంభీభూతులుగ చేసినదనియు మాకు తోచినట్లు చెప్పసాగితిమి. "అవును" అన్నాడు మాకథకుడు. "అయితే నాకథకు అద్భుతమును, యసాధారణమును అగు విషయములు మూడు కలవు. మొదటిది రంగూనులో నివాసమేర్పరచుకొన్న యొకవణిజుని ముఖము మదరాసులో ఒకపూటకూటియింటియందు కనబడుటయేకాక వాని జీవితముతో కూడ సమ్మిళితమై యుండుట. దీనిని విశదీకరించుటకు శాస్త్రవేత్తల సహాయముపొందవలెను. ఇది కొంచెముకాలము పట్టును. రెండవది. ఏదోయొక యద్భుతఘటనవలన వాడిముఖము ఈ వీథిలో కనబడుట, వాని పేరును యదియేయగుట. విచిత్రముగ లేదా?" అనెను.

మేము వానితో ఏకీభవించినాము. మొదట మేము మొదలుపెట్టిన దయ్యముల విషయమునుగుఱించి ఎక్కువ యుద్రేకముతో తిరిగి మాట్లాడుచున్నప్పుడు మా కథకుడు సెలవుతీసికొనెదనని లేచిపోవుచుండెను.

నా స్నేహితుడొకడు మాకథకుడు తలుపుదగ్గరయుండుటను చూచి మాయుద్రేకమునకు కారణము తెలిపి వాడు వెళ్లిపోవు లోపల "నీవిచిత్రకథకు మూడవయసాధారణవిషయమును చెప్పకుండగనే వెళ్లుచున్నావే" యని యన్నాడు.

"హా! మూడవవిషయమా?" యని తలుపుతెఱచుచు అన్నాడు. "నేను దానివిషయము మరచి పోవుచున్నాను. మూడవయద్భుతవిషయమా! నేను యీకథను యరగంటకుపూర్వమే కల్పించినాను. వందనములు" యని వెళ్లిపోయినాడు. మాకు మరల తెలివివచ్చునప్పటికి మామధ్యకువచ్చిన విషపుచ్ఛముగాని, దానిని తీసికొనివచ్చిన మాస్నేహితుడుకాని కనుబడలేదు.

# మీరాబాయి

శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మ గారు

ఎక్కడి యాంగ్లదేశ మిదిఎక్కడి భారతదేశ మద్దిరా!
ఇక్కడికేగుదెంచి ఇటు లెంతయుదీక్షను మాదుముక్తికై
తక్కక రాత్రియుంబవలు తల్లిరో! శ్లేడురో! పాటునొందు నీ
ఎక్కువదైన ఈఋణము నేగతి నీగదెమమ్మ ఇమ్మహిన్.

ఆంగ్లదేశమునందు నతివిరక్తినిజెంది గాంధిమహాత్ముని గాంచితమ్మ
కాంచిమహాత్ముని ఘనముగాసేవించిమించి యాతనియాజ్ఞ మీరకుండ
దేశసేవనుజేయు దీక్షతోపనిబూని ఖద్దరువ్యాప్తికై కదలియచోటు
కడకు మాసీమకు వడివడినేతెంచి మేమెల్లముదమంద మీరబాయి!

దర్శనంబిచ్చి మమ్ముల దనిపినావు
మీదురాకను జేసియే మాదునాంధ్ర
దేశ మిదిమొదల్ స్వాతంత్ర్యదీక్షబూని
మాతృదాస్యంబుబాపగా మరలుగాక.

మృగతృష్ణను బోలెడునా
దగను విలాసమును విడచితల్లీ! శ్లేడూ!
నిగమాంతవేది గాంధికి
దగుకూతురవైతి వెంతధన్యవో ధాత్రిన్.

ముసుగులువెట్టి నెత్తులకు మూలలదాగెడు ఘూకరాజినాన్
విసువక సంచరించుమము వ్రేల్మని తేజమునొందజేయగా
అసదృశలీలవచ్చితివి యాంధ్రులదేశము ధన్యమయ్యె శ్రీ
విసరము గర్వముంగొనియె మీరవు నీదగుకార్యదీక్షకై.

నీరదనారదకీర్తిని
ఆరంగాగాంచి మాదునాంధ్రావనిలో
గౌరవమారగ దిరిగిన
మీరాబాయిరో! హరినినుమేలుగ బ్రోచున్.

# మహిళోన్నతి

విద్యాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

విద్యయందేమి, నాగరికతయందేమి, యాత్మగౌరవమందేమి యెంతయో వెనుకబడి యధఃపతితమైయున్న మహిళాగణమునుజూచి హృదయమునందెంతయువగచి తదభివృద్ధికై విశ్వాసముగఁ బాటుపడి చాలవఱకు జయమునందినది స్వర్గీయ శ్రీరాజా రామమోహనరాయలు. అగుట నా మహామహుని విస్మరింపఁజాలక యిప్పటికిని స్మారకదినోత్సవముల జరుపుచు దేశమాత విశాలహృదయునియెడఁ గృతజ్ఞత చూపుచున్నది. ఇపుడు సామాన్యముగ స్త్రీవిద్యావిషయమున సంశయించువారుగానీ, యవరోధము గల్పించువారుగానీ లేరని చెప్పవచ్చును.

కాని ప్రస్తుతవిద్యావిధానము స్త్రీలకెంతవరకు విజ్ఞానాభివృద్ధిని గలిగించుచున్నది యను విషయము నాలోచింపవలసియున్నది. ఏజాతియైనను, ఏదేశమైనను బాగుపడవలయునన్న నాయావ్యక్తుల విద్యాబుద్ధులు సచ్ఛీలద్యోతకములుగను సునిశితములుగను నుండవలయును. అపుడే నేనను విజ్ఞాన మావ్యక్తుల కుదయించును. దానినిబట్టి దేశముయొక్కయు జాతియొక్కయు నభివృద్ధు లుండును.

ప్రస్తుత మేకారణముచే నైననేమి దేశమున నొకవిధమగు విచిత్రపరిణామ ముదయించినది. స్త్రీవిద్యయందాసక్తిగలుగుటచే నెన్నియో స్త్రీవిద్యాశాలలను బలువురు స్థాపించి ప్రచాలనమొనర్చుచున్నారు. ఇవి యెంతవఱకు సక్రమముగఁ బ్రచలితములగుచున్నవియను విషయపరిశీలనమునకుఁ గడంగిన నెంతయు నిరుత్సాహమును నసంతృప్తిని బొందవలయును. అట్టి నిస్తేజప్రచాలనమునకుఁ బరిపాలనాదిలోపములు పెక్కులు నిదానములు. ప్రస్తుతము దేశమునందు బహుళముగ ననుసరింపఁబడుచున్న స్త్రీవిద్యాప్రణాళిక యేమియు బాగులేదని చాలమంది విద్వాంసులును విదుషీమణులును నంగీకరించుచునే యున్నారు. మొనమొన్న జనవరిమాసమున లాహోరునందు జరిగిన యఖిలభారతమహిళాసభ కధ్యక్షతవహించిన శ్రీమతి ముత్తులక్ష్మిగారు సైతమీవిషయము నుగ్గడించియున్నారు. కావున నీ విద్యాప్రణాళికను బాగుచేయుట యెంతయు ముఖ్యమైన విధి.

నేడు స్త్రీలకు విద్యయందాసక్తి ప్రబలినది. దానివలన సాంఘికదురాచారములు కొన్ని నశించినవి. గతవత్సరమున జూలై, ఆగస్టు, సెప్టెంబరు మాసములందు మధ్యరాష్ట్రములందును, బొంబాయిప్రాంతములందును సంచారమొనర్చిన శ్రీమతి కజిన్సుసతిగారు "స్త్రీస్వచ్ఛందదళశాలలు సైతము పురుషశాలలువోలె విశ్రాంతములై మనోహరములై యున్నవి; స్త్రీ లన్నివిషయములలోను ముఖ్యపాత్రమును గైకొనిరి. పట్టణములందును బల్లెలందును గాంధిగారియుద్యమము స్త్రీల స్వేచ్ఛావిషయమై యనఁగ ఘోషా

బాలికల (జూనియరు, సీనియరు) సర్టిఫైడు పాఠశాల



బాలికలు ఆడుకొనుట

బాలికల (జూనియరు, సీనియరు) సర్టిఫైడు పాఠశాల



'గరల్ గైడ్సు'

మొదలగు దురాచారబహిష్కరణమునకై యితఃపూర్వము లేని నాగరికతను గలిగించినది" అని యొకానొకసందర్భమునఁ దెలిపియుండిరి.

స్త్రీ విద్యాభివృద్ధివిషయమునఁగానీ, స్త్రీ స్వాతంత్ర్యవిషయమునఁగానీ యాంధ్రేతరదేశము లెంతయు ముందంజవేయుచున్నవను విషయము సర్వులును నంగీకరింపవలసినదే. దీనికి బంగాళాదేశమునందలి సరోజనళినీనారీమంగళసమితియే ప్రబలోదాహరణము. అట్టి యున్నతాదర్శసంస్థలను, నారీపురోభివృద్ధికాంక్షాసంస్థలను నిర్విఘ్నముగ నొనసాగించువారు లేరు సరిగదా తుదకుతదభిప్రాయసూచకులు సైతము మనయాంధ్రదేశమున స్త్రీపురుషులలో లేరని వచింపవలసివచ్చినందులకెంతయు విచారము. మనదేశస్త్రీలలో సైతమువిదుషీమణులు లేకపోలేదు. కల్పనాశక్తిగల బుద్ధిమతులు లేకపోలేదు. ధైర్యవతులును లేకపోలేదు. కాని వారివైదుష్యాదులు లేశమును బ్రకాశించుటలేదు. దీనికిఁగారణము ప్రథమము పురుషులే. తదనుగుణ్యముగ నాయువతులును బ్రవర్తించుటచేఁ బైకి రానవకాశములేకపోవుచున్నది.

నెహ్రూపరివారమునందలి సంభ్రాంతమహిళామండలమును, పంజాబునందలి జుత్షి పరివారములోని శిక్షితవిదుషీమణులును, జడ్జి త్యాబ్జీకుటుంబములోని మహమ్మదీయ మహిళామణులును, దాదాభాయి నౌరోజీ పరివారమునందలి మహిళాగణమును, ఇంకను హిందు, ధని, వ్యవసాయకాది మహిళామణులును నీముక్తిసమయమున నెట్టిత్యాగము చూపిరో, యెట్టి స్థానమునాక్రమించుకొనిరో యాంధ్రమహిళాగణ మెఱిఁగియేయుండునా? ఇంతయేల? ప్రస్తుతవిషమసంఘటనమున దేశమునింతవఱకివిధముగనిలువఁబెట్టినది యాంధ్రేతరరాష్ట్రస్త్రీలే యనుటలో సందేహములేదు. అంతమాత్రమున నాంధ్రస్త్రీలేమియుఁ జేయలేదని నాయభిప్రాయముగాదు. కాని చేయదగినంతమాత్రము చేయలేదు. శక్తివంచన కాన్పించుచున్నది.

మొన్న భారతశాసనసభ కధ్యక్షతవహింపనున్న శ్రీయుత షణ్ముఖంచెట్టిగారిని దత్పదవికి రాజీనామానియ్యవలసినదిగఁగోరుచు ఢిల్లీలో స్త్రీలు వారికిడిన తుదిచీటి (Ultimatum) జూచిన దత్ప్రాంతమహిళాగణముయొక్క ధైర్యస్థైర్యములు సుస్పష్టములగును.

రౌండుటేబిలు కాన్ఫరెన్సులో శ్రీమతి బీగమ్ షానవాజ్ హిందూమహమ్మదీయ సఖ్యతనుగుఱించి చెప్పిన గంభీరములగుమాటల విన్ననెంతయు నానందములగును.

"నేను భారతస్త్రీలపక్షమున మీకు మనవిచేయునదేమనఁగ సోదరీమణులమై నిరీక్షించునదియు, దనయలమై యర్థించునదియు, మాతలమై యాజ్ఞాపించునదియు మీరందఱునుగలసి యేకాభిప్రాయమునకు రావలయుననియే. 7000 మైళ్లదూరమునుండి మేము వచ్చినది మీదేశాభ్యుదయమునకేగదా." ఇత్యాదివాక్యముల నామెధీరయై నిండుసభలోఁ బ్రత్యేకముగ హిందూమహమ్మదీయసోదరులను సంబోధించి పలికినది. కీచులాడుచున్న పురుషప్రతినిధులకు వారికార్యమును స్మృతికిఁదెచ్చి కర్తవ్యము నుపదేశించినది.

దేశమింత పరిణామము చెందినను, విజ్ఞానమునందినను మన స్త్రీలింకను చీఁకటింటఁ జిందులాడుట వెట్టిపని. వైదుష్యముగల మన మహిళాగణము పైకివచ్చుటకే లజ్జించుచున్నారు. మా బాలికాపాఠశాలలలోని యాంగ్లభాషాకోవిదలైన యుపాధ్యాయినులను గృహలక్ష్మి కొరకు స్త్రీజనోపయోగమగు వ్యాసమును వ్రాసి యంపుఁడని యెంతచెప్పినను వైముఖ్యమునే చూపించుచుండిరని చెప్పుటకు నేనే లజ్జించుచున్నాను. ఇట్లున్న మహిళోన్నతికి లేశమేని యవకాశముండునా? దేశాభ్యుదయమునకేమేని యాశయుండునా?

మహిళోన్నతికిఁ బురుషులే చేయవలసినది లేదు. పురుషులు తమ మహిళాగణమునకుఁ దామీయదలఁచినంత స్వాతంత్ర్యమును, విద్యోపార్జనాసౌకర్యములనునొసఁగినారు. అంతమాత్రపు స్వాతంత్ర్యాదులు చాలవు. అన్ని విషయములలోను బురుషులతోఁ బాటు సమానహక్కులు స్త్రీలకు నైత ముండవలయును. అపుడు దేశమన్ని విషయములలోను బాగుపడును. ఇట్టి సమానత్వమునకు ముఖ్యము మనయాంధ్రదేశమందు నైతము నారీసమితులను స్థాపించి యుత్సాహకరముగఁ బ్రచాలన మొనర్చుటయే.

కావున మహిళాగణమంతయు వారియొక్క నైచ్యము నెఱింగి తాము ప్రపంచములోఁ గొద్దిదో గొప్పదో పుణ్యోపార్జన మొనరించుకొనుట కవకాశమున్నదని యెఱింగి యనవసరలజ్జాదులఁ ద్యజించి ధైర్యముగలిగి దేశాభ్యుదయమునకుఁ బాటుపడి తమకును తమజాతికిని తమదేశమునకును గౌరవము సంపాదింపవలయును. ప్రస్తుతవిద్యాప్రణాళికను సాధ్యమైనంతత్వరలో బరివర్తన మొనర్పవలయును. పాశ్చాత్యవిద్యావ్యామోహము నంతరింపఁజేసి ప్రాచీనభారతీయనాగరికతను బునఃప్రతిష్ఠిత మొనర్పవలయును. ఇప్పటికినిరూపుమాయని సాంఘికాచారములను దొలఁగింపవలయును. స్త్రీ మాతృదేవత, శక్తిస్వరూపిణియను నుడిని సిద్ధాంతీకరించి యితోధికగౌరవము నందవలయును. దేశముయొక్క బాగోగులు సంసారమునందువలెనే స్త్రీపురుషులమీఁద నాధారపడియున్నవని గ్రహింపవలయును.

## సూర్యప్రార్థనము

శ్రీమతి భారతం సీతామహాలక్ష్మమ్మగారు

చక్రచక్రములకు కంతుశరవిధూత
భవవిషాదముదీర్చెడు బాంధవుడవు,
అలవసంతాదియజ్ఞకార్యంబులందు
సురలకనువొచు తోడ్పడు గురుడవీవె,
తిమిరమనురక్కసుని ద్రుంప దీప్తిగలిగి
పవలు దుర్వారరాక్షసబాధమాన్పి
భీషణప్రదమౌ రోగభీతిమాన్పి
వరలు నాతపకర! నీకువందనములు.

పరమముముక్షువులకుగూడ పరమపదవి
నొసగిసస్యములకు వర్షమొసగుదేవ!
తామరవికాస! ఘనదురితాపహార!
ప్రకటితయశోధనాఢ్య! యోభానుదేవ!
అధికవేదము కరతలామలకమగుట
కతన ని న్ననుదిన మనురక్తిగొలిచి
శాశ్వతానందసుఖవయోరాసిజెలగ
గోరి, త్రిజగంబులెల్ల నిన్ గోరుచుండు.

# నిష్కృతి

తుమ్మలపల్లి వేంకటసీతారామారావు గారు

౧

అర్ధరాత్రి. పన్నెండుదాటి పావుగంటయింది. కచేరీచావడిలోఉన్నదీపము కొద్దిగాతగ్గించబడిఉన్నది. పగలంతాపనిచేసిన బడలికచేత పడకకుర్చీలోనే పండుకొని నిద్రబోతూన్న పద్మనాభము ఉలిక్కిపడి లేచేడు. దీపాన్ని పెద్దదిగాచేసి "ఎవరక్కడ?" అని కేక వేశాడు. "నేనే రంగనాథాన్ని" అని గుమ్మముదగ్గిర నుంచి జవాబువచ్చింది.

పద్మనాభము "సరే, లోపలికిరా" అన్నాడు. రంగనాథములోనికి ప్రవేశించేడు. అతడు పద్మనాభానికి తమ్ముడు. బాల్యయౌవనమధ్యకాలములో అశ్రద్ధగా విడిచివేయబడడంచేత అతనివర్తనం దుష్పథాన్ని అనుగమించింది.

పద్మనాభము సోదరుడి మొఖంచూసి నిర్విణ్ణుడైపోయినాడు. దుస్సహంగావస్తూన్న మత్తుపదార్థాల వాసనను అతికష్టంతో సహించుకొని, "నీవెవరినైనా హత్యచేసిరాలేదుగదా!" అనిఅడిగినాడు. రంగనాథము ఏదో చెప్పబోయినాడు. కాని హృదయంలోఉన్న ఆందోళనవల్ల మాటలుతడబడినయి. చిట్టచివరకుకొంచెము తేరుకొని "చేసేవచ్చేను" అని హీనస్వరంతో ప్రత్యుత్తరమిచ్చేడు.

"ఎందుకు చేయవలసివచ్చింది?"

"మానవతి అయిన ఒక స్త్రీయొక్కమానము కాపాడడానికి."

"ఆమె ఎవరు? ఆమెకు నీకు ఏమిసంబంధం?"

"సంబంధమేమీలేదు. ఆకస్మికంగా తటస్థపడినది. ఆమె ఒక అదృష్టహీనఅనుపరిత్యక్త. ప్రఫుల్లమై నెత్తావులచిమ్మవలసిన ఆపుష్పము విధివశాత్తు కర్దమకలితకంటకమార్గంలో పడిపోయింది. అలాంటిపుష్పాన్ని నలగద్రొక్కడానికి ప్రయత్నిస్తూన్న ఒకకిరాతకుణ్ణి నేను ఎదుర్కొనవలసివచ్చింది."

"ఆమెను గురించిన వివరాలింకేమైనా తెలుసునా?"

"ఆమె ఒక సద్వంశములోపుట్టినదిలాగ కనుబడుతూంది. ఆమెకు మోహనలాలుఅనే అతనితో పదునాలుగోయేట వివాహము జరిగింది. వారిద్దరు రెండేండ్లు కాపురంచేసిన తరువాత ఒకరోజున మోహనలాలు అకస్మాత్తుగా మాయమైనాడు. అప్పటినుంచి ఆమె యీవిశాలజగతీరంగంలో ఏకాకినియైపోయింది. వ్రయ్యలైన గుండెలలో అతనిని వెదకడానికీమెపడ్డపాట్లన్నీ వ్యర్థమైపోయినవి. వెతికీవెతికీ విసికి చివరకు ఈమె యీపట్టణానికివచ్చి కారన్‌వాలిస్ట్రీటులో 58 నెంబరున్న యింట్లో ఒకభాగాన్ని అద్దెకుతీసుకొని ఉంటున్నది."

"మరి—హత్యజరగడానికేమిటి కారణం?"

"ఇలాఉండగా జయరామ్ అనేయువకుడు ఆమెను ప్రేమించి తిరస్కృతుడైనాడు. కాని వాడు బలిమినైనా ఆమెను సాధించాలని ప్రయత్నాలు ప్రారంభించేడు. ఈరోజురాత్రి పదిగంటలకు నేనామె ఉన్నయింటికి నాస్నేహితుడికోసకు వెళ్లడం తటస్థించింది. నాస్నేహితుడు లేనందువల్ల తిరిగివస్తూండగా భయంతో ఆమెవేసిన కేకలు వినిపించినవి. ఉత్సుకతతో కిటికీదగ్గరపొంచుండి చూసేటప్పటికి లోపల జయరామ్ తప్పతాగి ఆమెనుబలాత్కరిస్తున్నాడు. ఆమె అప్పటిస్థితి నాహృదయాన్నికరగించింది. వెంటనే నేను తలుపులనుతన్ని లోపలికిప్రవేశించి ఒళ్లుతెలియనికోపంలో వాడిగొంతుకనులిమివేశాను. తరువాత ఆశవాన్ని

భుజముమీదవేసుకొని వీథిలోకివచ్చేను. ఆకాశము మేఘావృతమై ఉండడమువల్ల కటికచీకటిగా ఉన్నది. జనసంచారమేమీలేదు. ఆఅవకాశాన్ని పురస్కరించుకొని ఆశవాన్ని వంతెనదగ్గిర పారేశాను."

"ఆశవానికి సంబంధించిన వేమైనా తెచ్చేవా?"

"ఏమీ తేలేదు."

"సరే, ఇక్కడనుంచి సరాసరి నీవు ఇంటికిపో. బయటికిరాబోకు."

రంగనాథము వెళ్లిపోయినాడు. నిర్మలమై, శాంతమైఉన్న పద్మనాథము మానసకాసారంలో ఒక్క ఉదుటున పెనుబండబడినట్లయిపోయింది.

ఆమిగిలిన రాత్రిఅంతా అతనికి నిద్రయేలేదు.

## ౨

తెల్లవారింది.పద్మనాథము కాలకృత్యాలుతీర్చుకొనికాఫీపుచ్చుకొన్నాడు. కారన్‌వాలిస్‌స్ట్రీటుకువెళ్లి ఆస్త్రీనికలుసుకొందామని మెల్లెగాబయలుదేరేడు. ఆవీథిలో 58 నెంబరున్న యింటినిజేరి తలుపు తట్టేడు. ఒకముసలిదాసివచ్చి తలుపుతీసి అతణ్ణి సగౌరవంగా లోపలికితీసికెళ్లి ఒకకుర్చీమీద కూర్చోబెట్టి పోయింది.

కొంతసేపటికి అతనికి ఒక సుకుమారి ద్వారముదగ్గఱ ప్రత్యక్షమైంది. ఆమెముఖము అమితభయాన్ని సూచిస్తూఉన్నది. ఆమెపైదృష్టి కనిపెట్టి పద్మనాథము "నేను రంగనాథానికి అన్నను. నీమేలుకోరే యిక్కడకువచ్చేను. ఎంతమాత్రము భయపడనక్కరలేదు."అని అభయహస్తము చూపుతూఅన్నాడు.

"నేను మీతమ్ముడిగారి మహోపకారానికి ఆజన్మాంతము కృతజ్ఞురాలిని"అని ఆమె హీనస్వరంతో అన్నది.

"నీపేరు ఏమిటి?"

"ఇందుమతి. నాదౌర్భాగ్యగాథనుబహుశః మీతమ్ముడిగారినోట వినియేఉంటారు."అని ఆమెఅన్నది.

"విన్నాను. హత్యజరిగినప్పుడు ఇక్కడ యింకెవరైనా ఉన్నారా?"

"ఎవ్వరులేరు. తొమ్మిదిగంటలకే ఆవేశ్యదాసీదానిని పంపించేశాను. నేను ఒంటరిగా ఉండడము చూసే వాడు దుండగానికి పూనుకొన్నాడు. అప్పుడేదైవములాగ తమతమ్ముడుగారువచ్చి నన్నురక్షించేరు."

"నీవింకా చెప్పవలసిందేమన్నా ఉందా?"

"ఏమీలేదు. సాధ్యమైనంతవరకు వారిని పోలీసువారి బారినుంచి రక్షింపవలసిందని ప్రార్థన."

"రంగనాథము నిన్నెలా ఎరుగును?"

"ఆదుష్టుడు బాధిస్తూన్నపుడు భయమువేసి నేను కేకలువేశాను. అప్పుడు వీథిలోనుంచి వారు పరుగెత్తుకొనివచ్చి నన్నురక్షించేరు."

"నీవు చాలాజాగ్రత్తగలిగి ఉండవలసి ఉంటుంది. ఆహత్యకు నీకు సంబంధమున్నదని ఎవరికిని అనుమానము కలుగకుండాఉండేవిధంగా నీవు ప్రవర్తించాలి."

"అలాగే."

పద్మనాథములేచి యింటికిబయలుదేరేడు. ఇందుమతి స్వరూపసంపద-లజ్జావినయశీలాలు-అతని హృదయఫలకాన ముద్రాపితములైపోయినవి. అంతటి సద్గుణములుగల మనోహరవిగ్రహాన్ని పరిత్యజించి పారిపోయిన పాషండుణ్ణి దూషించేడు. దైవమామెపట్ల కాఠిన్యతవహించినందుకు నొచ్చుకొని, ఆమెకు సాయము చేసిన తనతమ్ముడి ఔదార్యమును, సాహసమును ప్రశంసించుకొన్నాడు.

## 3

రంగనాథము మూడోనాడు వార్తాపత్రికలో హత్యావృత్తాంతం ఈకిందివిధంగా పఠించాడు.

"కార్న్ వాలిసుస్ట్రీటు సందలి హత్య

27-వ తేదీ ఉదయమున కార్న్ వాలిసుస్ట్రీటు తిరుగుడులో వంతెనదగ్గర ఒకమనుష్యకళేబరము కానబడినది. గుఱుతులనుబట్టి చూడగా ఒకహత్యజరిగినట్లు తోచుచున్నది. శవము రైల్వేకంపెనీలో చిన్న ఉద్యోగియైన కే. జయరాంఅను వానిదని ధ్రువపఱుపబడినది. పోలీసువారు అతిజాగరూకులై హంతకుని కొఱకు వెదకుచున్నారు. ఇంకను జాడలేమియును దెలియరాలేదు."

అతడు దానిని పదేపదేచదువుకొన్నాడు. ఆహత్యచేసిన హంతకుడు తానేగదా అనుకొన్నాడు. పాపకృత్యానికి తగినఫలం పరమానందంగా అనుభవించకుండా పిరికిగుండెతో దాన్ని తప్పించుకొనడానికి ప్రయత్నించడము నీచమనుకొన్నాడు. అతనికి జీవితమువిూద ఒకవిధమైన విరక్తిపుట్టింది.

అతడు వీధిలోకివచ్చి పరధ్యానంగా పోవసాగేడు. అవతలివైపునుంచి ఒకబిచ్చగాడు ఒకపాట పాడుకొంటూ వస్తున్నాడు.

ప్రాపంచికసుఖంబు పరమావధిగనెంచి
పాపివై పోబోకె మనసా!
ప్రకృతిలోపలనున్న ప్రణవంబుభజియించి
పరమాత్మజేరవే మనసా!

వైరాగ్యమార్గాన్ని అనుసరించిన రంగనాథము మనస్సులో ఈపాటయొక్క భావము బాగాహత్తుకొనిపోయి అతనిహృదంతరాళాన్ని కలచివేసింది. వెంటనే అతడుజేబులోనుంచి రూపాయిఒకటితీసి ఆబిచ్చగానికియ్యపోయినాడు. ఆబిచ్చగాడు "నాకు అక్కరలేదు. పరమానందంతో పాటలుపాడుకొమ్మని పరమాత్ముడు అయాచితంగా యీకానుక మొన్నరాత్రి నాకు సమర్పించేడు." అనిరాళ్లతో చెక్కబడ్డ ఒకఉంగరాన్ని జోలెలోనుంచి తీసి రంగనాథంచేతి కిచ్చేడు.

రంగనాథం దాన్నిపరికించి కెవ్వుమన్నాడు. ఆశ్చర్యం!! 'కే. జయరాం' అనేఅక్షరాలాఉంగరం విూద ఉన్నాయి.!!!

## ౪

మర్నాడు పద్మనాభము పత్రికలో

"కార్న్ వాలిస్ స్ట్రీటు సందలిహత్య

నిన్నటిరాత్రి పోలీసువారు హంతకుని బంధించిరి. అతడు బౌబజారులో తిరుగుచుండగా పట్టుకొనబడియెను."

అని ఉండడము చూశాడు. దడదడలాడేగుండెతో తమ్ముడింటికివెళ్లేడు. రంగనాథము నిద్రపోతున్నాడు. అతణ్ణిచూడగానే పద్మనాభము మనస్సులోఉన్న గందరగోళం ఒక్కపెట్టున శాంతించింది. అమాయకుడొకడు పట్టుబడ్డాడనుకొన్నాడు. వెంటనే తమ్ముణ్ణిలేపి జరిగినసంగతి తెలియజెప్పేడు. రంగనాథము అంతావిని "నిన్న నాకొకబిచ్చగాడు కనబడ్డాడు. వాడిదగ్గఱ "కే.జయరాం" అనేఅక్షరాలున్న

ఉంగరమున్నది. దాన్ని చూడగానే నాకు అపరిమితమైన భయం వేసినందువల్ల ఆభయావేశంలో అది వాడి కెట్లాలభ్యపడ్డదో తెలిసికోలేకపోయినాను." అన్నాడు.

"ఎవడా బిచ్చగాడు? ఎలా ఉంటాడు?"

"కొంచెము పొడగరి. కాషాయవర్ణము అంగరఖా తొడుక్కొని ఒక ఎఱ్ఱబనాతు టోపీ పెట్టుకొని ఏకతారవాయిస్తూ తత్వాలుపాడుతుంటాడు."

"ఓహో! అతణ్ణి నిన్న సాయంకాలం ఇద్దరు పోలీసులు పట్టుకొని వెళ్ళుతూండగా చూశాను. అతడు శాంతంగా వారివెంటపోతున్నాడు. ఆ ఉంగరమున్నందుకే పట్టుకొన్నారు కాబోలు."

రంగనాథము మాట్లాడలేదు. అతనిమనస్సుకు అస్వస్థత జాస్తిఅయింది. నిష్కారణంగా ఒకనిరపరాధి శిక్షింపబడపోతున్నాడే అని అతనికి విచారము మెండుకొన్నది.

౫

హత్య విచారణకువచ్చింది. కోర్టునిండాజనులు కిటకిటలాడుతున్నారు. పద్మనాభము రంగనాథముకూడా వచ్చి వాళ్లలో ఒకమూలకూర్చున్నారు. కొంతసేపటికి బిచ్చుకత్తులతో పోలీసులు ఒకబిచ్చగాణ్ణి తీసికొని వచ్చి బోనులో నిలబెట్టేరు. పోలీసుశాఖవారతనికి వ్యతిరేకంగా తగిన సాక్ష్యసామగ్రిని తయారుచేశారు. 'శే. జయరాం' అని అక్షరాలున్న ఉంగరము ఆబిచ్చగానిదగ్గఱ దొరికినందువల్ల అతడే జయరాంను ఖూనీచేసి ఆఉంగరాన్ని హరించేడని నేరము మోపబడింది. విచారణలో అతడే హత్యచేసినట్టు రుజువుచేయించేరు. విచారణానంతరం ముద్దాయి యీక్రిందివిధంగా వాఙ్మూలంయిచ్చేడు.

"నాపేరు మోహనలాలు. అయిదేండ్లకిందట నామతిచలించి అమాయకురాలైన నాభార్యను ఒంటిగా విడిచిపెట్టి నేను దేశముమీద లేచిపోయినాను. తరువాత సంవత్సరానికి నాకు పూర్వస్మృతిరాగా మళ్లీ నాభార్యను వెదకడానికి ప్రయత్నాలుచేశాను. కాని ఆమెయెక్కడా కనుపించలేదు. ఆమె బహుశః నాకొఱకు దిగులుపెట్టుకొని మరణించిఉంటుందనుకొని విరాగినై ఈవేషంతో భిక్షాటనముచేసుకొని జీవిస్తూ ఊరూరుతిరుగుతూ ఇక్కడికివచ్చేను. నేనింతవఱకు ఋజుమార్గాన్ని తప్పలేదు. 26-వతారీకున నాకొక దమ్మిడీఅయినా దొఱకలేదు. ఆరోజురాత్రి ఆకాశము మేఘాలతో ఉరుములతోనిండి గాఢాంధకారపటలి కమ్ముకొనేటట్టుచేసినందువల్ల పట్టణమంతా పెందలకడనే మాటుమణిగింది. ఊరంతాతిరిగినా నాకొక నాణెముకాని, కబళెడన్నముగాని పెట్టేవారులేకపోయినారు. అర్ధరాత్రిఅయింది. అప్పటికి కారన్‌వాలిసు స్ట్రీటు వంతెనదగ్గరకువచ్చేను. తళుక్కనిమెఱసిన మెఱుపులో నేనాశవాన్నిచూశాను. క్షుద్బాధపీడిస్తూండడముచేత ఆదుస్తులజేబులలో ఏమన్నాడబ్బుంటుందేమోనని వెదికేను. ఏమీదొఱకలేదు. కాని ఎడమచేతి చిటికెన వ్రేలికిమాత్రం యీ ఉంగరమున్నది. దాన్ని తీసికొని వెళ్లిపోయినాను. ఇదే నేనుచేసిన అపరాధము."

తీర్పుచెప్పేరు. ముద్దాయికి ఉరిశిక్ష విధించేరు.

అంతావిని రంగనాథము ఉస్సురుమని పెద్దనిట్టూర్పువిడిచేడు. ఆనిట్టూర్పుతో కలిసి బహుశః అతని ప్రాణవాయువు లెగిరిపోయిఉంటవి.

౬

ఆమఱునాడు పద్మనాభము రంగనాథము యింటికివెళ్లేడు. తలుపులు కిటికీలు అన్నీ తెరిచేఉన్నవి. పిలిచేడు. ఎవరు పలుకలేదు. అన్నిగదులు వెతుక్కుంటూ పడకగది ప్రవేశించేడు. మంచముమీద రంగనాథము పక్కకొత్తిగిల్లి పండుకొనిఉండడము చూశాడు. దగ్గఱకువెళ్లి తట్టిలేపేడు. కదలలేదు. ముక్కుదగ్గిర వేలుపెట్టి

చూశాడు. ఉచ్ఛ్వాసనిశ్వాసములులేవు. అతనిగుండెలు గభుక్కుమన్నవి. చేతులు ముట్టుకొన్నాడు. మంచుగడ్డలాగా చల్లగాఉన్నవి. హతాశుడై పద్మనాభం కుర్చీలోకూలబడ్డాడు. తరువాత గదిచుట్టు తెల్లబోయి చూశాడు. బల్లక్రింద ఒకకవరుపడిఉన్నది. లేవనెత్తిచూశాడు దానిమీద "అర్జంటు—దీనిని పోలీసువారి కందజేయవలయును" అని వ్రాసిఉన్నది. లోపలఏమున్నదో అని చించి చదివేడు.

"నేను స్వబుద్ధిచేత చావనిశ్చయించుకొన్నాను. కారణ్‌వాలిస్‌స్ట్రీటుహత్యలో నేనే హంతకుడిని. నాకుబదులుగా నిరాపరాధియైన యింకొకడు మరణదండనఅనుభవించబోతూంటే నేనుచూస్తూ ఊరకోలేక-విశేషించి నేను ఏసాధ్వియొక్క అభిజాత్యాన్ని కాపాడడానికీహత్యనుచేయవలసివచ్చిందో ఆమెయొక్క భర్తయే నిష్కారణంగా అనుమానింపబడి శిక్షకుపాత్రుడు కావలసివచ్చినందువల్ల ఆత్మహత్యకు పూనుకొని నాపాపానికి నిష్కృతి నాచేతిమీదుగానే అనుభవించేను. ఉదారస్వభావులైన మీరు అనిర్దోషినివదిలి కారణ్‌వాలిస్‌స్ట్రీటులో 58 నెంబరుగలయింటిలోఉన్న ఇందుమతిఅనే ఆమెకు అతణ్ణి ఒప్పగించవలసింది. ఇదే నా అంత్యసంప్రార్థనము.—రంగనాథము."

పద్మనాభము కొయ్యబారి అలాగే చాలాసేపు నిలువబడిపోయినాడు. తరువాత ఆకాగితాన్ని పోలీసు వారికిచ్చి మోహనలాలును విడిపించి, చాలకాలమునుండి వియోగదుఃఖము అనుభవిస్తున్న ఆదంపతులకు సంయోగభాగ్యము కలిగించి పుణ్యముకట్టుకొన్నాడు.

## పుష్పకన్య

తిమ్మరాజు సత్యనారాయణరావుగారు

మాయయు మర్మమున్ గన, వమాయకురాలవు, పుష్పకన్య! నీ
ప్రాయము, నీదుప్రేమఁ, గనుపారఁగఁగ్రోలి, సమస్తసౌఖ్యముల్
హాయిగఁబొంది, నిన్విడిచి, యన్యులఁజేరి సుఖింపనెంచి, యీ
తీయనిప్రేమరాగముల దీయుచునుండెను భృంగమక్కటా!

ఇది వినిర్మలప్రణయవాహినియటంచు
నెంచి, యీపుష్పకామినీవంచకవరు
స్నేహమాసించి, యాతనిఁజేరుదేమొ!
మోసపోయి విచారింతు ముద్దరాల!

ఈతని మధురమోహనగీతములును
లలితసుందరచిత్రవిలాసములును
గాంచి, కవికుమారులె భ్రమియించినారు;
అబలవీవు, భ్రమించుట యబ్బురంబె?

మాయయెఱుఁగని కామినీమణులహృదయ
సీమలలో ప్రణయలతలు చిగురులెత్త
జేసి, సుఖయించి, పిదప వంచింతురకట!
నమ్మరాదమ్మ! పురుషుల నమ్మరాదు!

## స్త్రీ శిక్ష

శ్రీమతి గండికోట సావిత్రీదేవిగారు

ఏదేశమైనను, ఏజాతియైనను వృద్ధినందవలయునన్న నాయాదేశముయొక్కయు, జాతియొక్కయు వ్యక్తులు సుశిక్షితులు గావలయును. శిక్షితులగు నావ్యక్తులు యుక్తాయుక్తవిజ్ఞానము గలవారై తమ బాగోగుల నెఱింగి సరిచేసికొందురు.

ఒకపక్షి యెగురవలెనన్న దాని రెండుఱెక్కలును సరిగనుండుటెట్లవసరమో యట్లే దేశాభివృద్ధికి స్త్రీపురుషులను వ్యక్తిద్వయమును నవసరము. ఈయిద్దరిలోను సమానమైన విజ్ఞానబలములేనిది దేశమం దేవిషయములును సరిగ కొనసాగవు. అగుట స్త్రీకి బురుషుని వలె సుశిక్ష యావశ్యకమని యందరును నంగీకరింపవలసినదే.

ఏయింటియందైన పురుషుడు విద్యావంతుడై బుద్ధిశాలియైయున్నప్పు డాతనిభార్య, సోదరి మొదలగువారు చదువురాని మూర్ఖురాండ్రై యున్నయెడల నాయింటిదినకృత్యము లెట్లు నడచునో యించుక యోచింపుడు?

మనదేశములో ప్రాచీనకాలపువారు తమ కుమార్తెలను చదివించుట చెడుపనిగా తలచి యుండలేదు. జ్యోతిషము, కవిత్వము తెలిసి ప్రసిద్ధిచెందిన స్త్రీలుకూడ నుండెడివారు కదా. ఈదినములలో పురుషులవిద్యవిషయమై ఎంత శ్రద్ధతీసికొనుట కనిపించుచున్నదో, స్త్రీల విద్యావిషయమై యంత శ్రద్ధతీసికొనుట కనుపించుటలేదు.

మఱియొక విషయము. స్త్రీల కెట్టిశిక్షణ మావశ్యకము? ప్రస్తుతస్త్రీ విద్యాశాలలలోని శిక్షణమెట్టిది? అందువలన నేమేని నష్టములుగలవా? యను విషయవిమర్శన మెంతయు నవసరము. ప్రస్తుతము స్త్రీల కిచ్చుచున్న శిక్ష పాశ్చాత్యసాంప్రదాయముల ననుసరించియున్నది. దాన భారతస్త్రీలకు లాభములేకపోగా విశేషించి నష్టమే కలుగు చున్నది. గృహమందు స్త్రీకి ముఖ్యమైన భాగము కలదు. స్త్రీలు గృహమునకు యజమానురాండ్రు. ఇంటిలోని యన్నిపనులమీద వారికధికారమున్నది. స్త్రీలయొక్క తెలివి, సత్ప్రవర్తన, ఉత్తమస్వభావములవలన ప్రతిగృహము స్వర్గముకాగలదు. లేక వారియొక్క దురాచారము, దుష్ప్రవర్తనవలన గృహము నరకమునకు ప్రతిగా తయారు కాగలదు. కావున స్త్రీలు చిన్నతనమునుండియు గృహజీవనమును గుఱించి తెలిసికొనవలెను. వలసినయెడల పురుషుల పనులను బోధపరచుకొని యవసరమువెంబడి సహాయముచేయుటకు కూడ స్త్రీలు యోగ్యులు.

మనదేశమందు స్త్రీలకు ప్రత్యేకశిక్షాప్రణాళిక నిర్ణయింపబడియుండలేదు. పురుషులతోబాటు కేవలము బి.యె; ఎం.ఏ. డిగ్రీలుపొందినంతమాత్రముచే స్త్రీజాతికుపయోగము లేదు. స్త్రీలకు పాశ్చాత్యనాగరికతానుసరణమం దుత్సాహముండుట జాతికి లాభకరము కాదు. కుటుంబజీవనమును సుఖప్రదమొనరించుటయే స్త్రీకి ముఖ్యము. కావున స్త్రీశిక్షా

బాలికల (జూనియరు, సీనియరు) సర్టిఫైడు పాఠశాల



పరిశ్రామిక శాఖావిద్యార్థినులు

బాలికల (జూనియరు, సీనియరు) సర్టిఫైడు పాఠశాల



బాలికలు ఉద్యానవనకృషిచేయుట

విధానమునందు గానము; శిశుపోషణ; పరిశుభ్రముగాను రుచికరముగాను పాకమొనర్చుట; కుట్టుపని; స్వల్పమైన వైద్యజ్ఞానమును; గణితజ్ఞానము నుండవలయును. ఆంగ్లేయభాష వ్రాయుట; తెలిసికొనుట; మాతృభాషయందు పరిపూర్ణమైన జ్ఞానము సంపాదించుట స్త్రీ కవసరము.

ఆంగ్లేయ శబ్దముల నన్నిటిని ప్రోగుచేసి యిచ్చినను; చరిత్ర, భూగోళశాస్త్రము గణితశాస్త్రము కంఠస్థమొనరింపజేసినను, భారతనారీమణులకు ముఖ్యముగా కావలసినవి దయ, ఓరిమి, దేశభక్తి, జాతీయభావములును. కావున శిక్షావిధానము వీనిననుసరించి యుండవలెను.

ఆధ్యాత్మికవిషయములోకూడ స్త్రీకి కొంతప్రవేశముండుట ముఖ్యము. ఎందుచేత ననగా జీవితములో నిత్యము ననేకకష్టముల నామె యెదుర్కొనవలసియుండును. అట్టి సమయములందాధ్యాత్మికవిషయమైన జ్ఞానములేనియెడల సహనశక్తి దుర్లభమగును. కాన స్త్రీలు భాగవతము, భగవద్గీత మొదలగు జ్ఞానప్రదములైన పుస్తకములు చదువవలెనను నియమమున్నయెడల లాభ మమితముగనుండును.

పసిబిడ్డలకు ముఖ్యమైన శిక్షకురాలుతల్లియే. తల్లియొక్క భావములు చేతలమీదనే బిడ్డయొక్క భావిదశ యాధారపడియుండును. శివాజీతల్లి శివాజీకి పసితనమునుండియు శూరాగ్రేసరులచరిత్రలను చెప్పుచుండుటచేతనే కదా యాత డట్టిపరాక్రమవంతుడును ఇంతటి ప్రఖ్యాతపురుషుడును నైనది? అభిమన్యుడు గర్భస్థుడైయున్నప్పుడేగదా పద్మవ్యూహమును ఛేదించువిధమును తనతల్లికి కృష్ణుడుచెప్పగా గ్రహించెను? ప్రస్తుతమున్నటియుం దున్న యనేకమహనీయులయొక్కయు ముఖ్యముగా మహాత్మాజీయొక్కయు జీవితచరిత్రలను చదివినయెడల నింతటి వారియున్నతికి కారణము బాల్యమందు వారుపొందిన మాతృశిక్షణయే యని తెలియగలదు.

కావున స్త్రీలందఱును కేవలము పాశ్చాత్యవిద్యానాగరికతాదివ్యామోహముల నందక తమకుభావ్యభివృద్ధిగలిగించెడి జాతీయవిద్యనేనేర్చి యధఃపతితమైయున్న దేశమును, జాతిని నుద్ధరింపవలయును!.

# ధ్యాత దేవి

జనమంచి కామేశ్వర రావు గారు

నీచూపులల్లిన
వలలోన చిక్కిపోయితిని.
నీరూపమొసగిన
కలల్లోన కరగిపోయితిని.

నీహొలకబోసిన
పేర్మినవ్వుకె దోసిలొగ్గితిని.
నీతళుకు వెల్తురెనాకు
జీవితపథమ్మునుచూపు.

దేవీ! నాభావమీవే!
నాజీవమీవే!
నాలోననీవే!
నీవే! నీవే!

# సుందరమ్మ

శ్రీమతి కం. రంగనాయకమ్మ గారు

"దీంధుంపతెగా, ఏవిటమ్మా తెల్లారకమునుపే ఆరంభించేవు రొసరొసలూ?"

"నావి రొసరొసలా- యూవన్నా గాని? అంటే అనగూడదుకాని చేశేపనులు చూస్తూవుండడానికా మనసొప్పదు. నోరునొక్కుకొని ఎంతకాలం పడివుండడం యూవన్నా గాని?"

"ఏవిటమ్మా, అడిగింబానికి సమాధానం చెప్పకుండా ఏవిటో అఘాయిత్యం చేస్తావు? ......దాన్ని లేపి కాస్త కచ్చికా తాటాకూ తెచ్చిపమ్మనూ!"

"కచ్చికా తాటాకూనా? ఒకబంట్రోతునన్నా పెట్టుకో! ఎవరికి చెప్పమంటావు! హయ్యో! అమాత్రం పుణ్యంగూడానా? మూరమ్మసుగవాసీ, శేరమ్మ పెద్దమనిసీ, అత్తకత్తరా చెప్పలగంపా అన్న శాస్త్రం ఊరికే పుట్టిందా బాబూ!"

"దాన్ని లేపమ్మా అంటే ఏవిటో పుట్టా పూర్వోత్తరాలు చదువుతావేమిటీ? దీంధుంపతెగా."

"ఎవళ్లను లేపనూ?- ఎక్కడుందని లేపనూ? యూవన్నా గానీ? ఎప్పుళ్లేచిందో! లేడికి లేచిందే ప్రయాణం. పుట్టసంగా పుష్మావూ, కాఫీచేసుకొంది- అయింతా టెంగురంగా అవి సుష్టుపూర్తిగా మెక్కింది. అస్వరాజ్యంకుర్రాళ్లని వంటేసుకుని పరుగో పరుగు. చేత జెండాపట్టుకొని- ప్రీకటింగుట! నాశ్రాద్ధమట! పాత్తగన్నీ ఎక్కడి వక్కడే పడేశి- కడగన్నా లేదు- వెళ్లింది. భయమా భక్తా? సిగ్గా యెగ్గా? సిగ్గువిన్నా నాడే విడిచేశింది. ముత్తైమంత సిగ్గువిడిస్తే ముల్లోకాలు యేలవచ్చు. యూవన్నా గాని. ఆవిడికి యిల్లూ వాకిలీ పట్టిందీ?...శ్నో...దారిలో తగలేయకపోతే కాస్త అసుంట తగలేశి పోరాదూ ఈ రాటాన్ని? పొద్దున లేచి యెవరిమొగం చూచానో రాట్నం ఠట్టుకొని బోర్లాబొక్కలా పడాను. ఆ సంబరంలో ఆవిడకి యూవన్నా తోస్తుందా? అవుపన్యాసాలూ, ఆ స్వరాజ్యగీతాలూ, ఆమీటింగులూ అస్తమానం ఇదీ వాలకం! ఏంజెప్పనూ? ఎవరినోట వినబోయినా సుందరమ్మగారే, ఎక్కడచూడబోయినా సుందర్మగారే, యూవన్నా గానీ! ఆడదానికి కాస్తసిగ్గన్నా వుండాలి- కాస్తవరవన్నా వుండాలి. ఒంట బుట్టందానికి ఒకరు చెబితే వస్తుందా? చెప్పినమాటా కట్టినచద్దీ యెంతకాలముంటుంది? యూవన్నా గానీ! కొంపలో మొగుడన్నవాడు న్నాడుగదా- తానిలా విడబడి తిరుగుతూంటే యెవరేమనుకుంటారో అన్న లజ్జాభిడియమూ అమనిషి కేకో శాస్నేనా వుందంటావా? ఉండేమనిషైతే యిలా తెగించి తైతక్కలాడుతుందా...యూవన్నా గాని?"

"దీంధుంపతెగా. ఈ స్వరాజ్య మడ్డగోలంటూ ఒకటొచ్చి కొంపతవ్వేస్తూందిగదా?"

"తవ్వేస్తూందా? గుణంచేస్తూందా! తాతముత్తాతలనాటినుంచివుండే ఈ గ్రామకరణీకం కాస్తా వూడగొట్టించడానికి దాపరమైంది ఈమహాతల్లి. యూవన్నా గానీ, ఆమాటన్నా తప్పే. స్వరాజ్యమంటే నాకు కిట్టదని నన్నాడిపోసుగుంటారు. తామంతా తెచ్చి వెలగబెడతారుగా! యూవన్నా గానీ! చూడకపోతానా ఈ పాపిష్టి కళ్లతోటి?"

"నీవు శోకలేయకమ్మా, మాయేడుపులేవో మే మేడుస్తామూ. దీంధుంపతెగా!"

"ఏడవటానికే వచ్చింది ఈజాతర. అక్షరాల యేడవటానికే. నవ్వడానికొచ్చిందనుకున్నావు కాబోసు ఈఅల్లరిబాజా! యూవన్నా గానీ. కుట్టిపెట్టినా నానోరు అవకుండావుండదు. దాన్నికాస్తఅదుపూ ఆజ్ఞలో పెట్టలేకుండావున్నావు. ఈవేళో రేపో పంపిస్తారు దాన్ని గోదావరిస్నానానికి. చూడునామాట ఖాయం- ఖాయం ముమ్మాటుకీ ఖాయం. యూవన్నా గాని."

"ఆదేవిటి వినుదుకోంతిరగడమోబాబూ- నేనూచూశాను ఆడవాళ్లని. ఈలాంటి బిడెం విడిచినదాన్ని క్కడాచూళ్లేదు. మాకాలాన్నయెన్నదేనా యెరుగుదుమా? అమారాజు యాదాదిష్టిని - యావన్నాగాని- అమ్మయ్యో! నిలిచిమాట్లాడి యెరుగుదునా? హయ్యో! నారాతరాళ్లబడ్డట్టైవుంది! ఏమిఅభాజనబ్బదుకురా, రాముడూ! అమారాజు జబ్బులోవున్నప్పుడు-పట్టుప్రాలర్రైక తొడుక్కుందానని యెంతోమనసైంది. ఎవరే మనుకుందురోఅని నాకునేనే బుద్ధిచెప్పుకున్నాను. మానాభిమానాలులేకపోయినాక బదికీప్రయోజనమేఁటి? యావన్నాగాని. ఇవ్వాళ్లబదికి యింటివెనకచచ్చిన పామైలైంది"

"దీందుంపతెగా-అనుకుంటేలాభమేమిటమ్మా. అనుభవించాలి. తీరాలి!"

"నేనుఅనేది అమాటే! యావన్నాగాని- నూనుపేపర్లదాకా యెక్కిందిగదా! దీనిఖైశారా! ఆదేలా పోలేయెవడిగ్గావాలి? పెదవికిమించిన పన్నైంది. సరిపోయింది. కరణంరామప్ప పెళ్లామంటూ మ్రోగిపోతూ వుంటే నావోళ్లునిలువుగాభగ్గని మండిపోతోంటుంది. యావన్నాగాని! దెబ్బైయేళ్లువచ్చేయి. యిప్పటికీనాకు పరాయిమొగాళ్లతో మాట్లాడాలంటే ప్రాణంచచ్చిపోతుంది. ఆమొగాళ్లతో వీధులెంటాగంతులేస్తూ వెడుతుంటుందిగదా! దీనిసిగ్గుచితకా! యావన్నాకాని. కాడెద్దులతోడాయె కంచెబీడాయెనన్నట్లు ఆప్పీలాయమ్మా, ఈలక్ష్మమ్మా, ఆరామమ్మాపొగడ్డారు. వారియిచ్చారచ్చా-వారాడింది ఆట పాడింది పాట. యావన్నాఅంటే చెడ్డదాన్ని-గయ్యాళిగంపనూను. తానుమూసినముత్తెం—పాసినపగడం. గుట్టుగావున్నకొంపకి యేమితిప్పలొచ్చేయిరా!...రాముడూ!...రాముడు..."

"దీందుంపతెగా - కరిణీకం ఊడేదిగాక ఉన్నఆకాస్తకొంప్రకూ నీటిసదుపాయంకూడా రద్దు చేస్తారట! ఇంట్లోఈకుమ్మ! బయట అకుంపటి! వంట్లోచూస్తే దిక్కుమాలినరోగం! ఊళ్లో నానా అల్లరీని! దుర్యోగాలన్నీ ఒక్కమాటేపట్టేయి చివరరోజుల్లో. అమ్మా! ఆకావడి పెట్టెలో ఇస్త్రీచేసినతుండు ఈలా పారవేస్తావ్!"

"ఇంకాతుండేఁవిటే? నీబట్టలూ తనబట్టలూ పెళ్లినాడు పెట్టినఊదాజరీచీరలతోసహా కార్యంనాటి కాశీకోకతోగూడా చీదాగాలగలేశిందిగాదుట్రా! ఏవిటేఅంటే అవిసీమగుడ్డలు వాటిని ముట్టనేనాముట్టగూడదు అది దేశద్రోహం మనం ఒడుక్కొని నేసుకొని కట్టుకోవాలిగాని అంటూబూకరించింది. యావన్నాగాని."

"ఒద్దోదేముడా అనిమొత్తుకోన్నానా? విన్నావా? తెచ్చికంతానికి ఉరేశావు. దక్షిణాదిపిల్లలు మన కణిగుండరమ్మా అనికూడకొట్టుకున్నాను. ఇప్పుడేడిస్తే ప్రయోజనమైనావుందా? అరవయ్యోపడిపడ్డ నాకిప్పుడు పెళ్లేఁవిటి? రెండువేలరూపాయిలు అచ్చాడీలు పుచ్చుపువ్వులల్లేపోశాను శుల్కం..దీందుంపతెగా. ఎవరేనా నవ్వి పోతారుకూడాను."

"అన్నీ తెచ్చిపెట్టింది నేనేనాయనా! నూనుపేపర్లు తెప్పించమన్నదీనేనే - నవలాలు తెప్పించి యిమ్మన్నదీ నేనే-నాటకాలకంపమన్నదీ నేనే-మీటుంగులకుపంపమన్నదీ నేనే-సంగీతాలుచెప్పించమన్నది నేనే-సినీమాలకు వెంటపెట్టుకొని వెళ్లమన్నదీనేనే-అంతానేనే- నేనుబదికుండబట్టే ఇంతఅనిష్టంచుట్టుకున్నది; కొంపకి! అమారాజుకళ్లముందు నేనుపోరాదు? పాపిష్టిదైవం నన్నుగానకపోవడమేమిటీ-యావన్నాగానీ- అరవయ్యోపడిలోపెళ్లాడినవారులేరా? సుఖపడ్డవారులేరా? ఈమాయదయోగం మనకేపట్టాలీ! వేలెడుమొలక పుడితే వంశాంకురం నిలుస్తుందని మురిశానుగాని ఈలా యేకుమేకై ఊరూఉగమూ యేకంచేశే మహామారి దాపరిస్తుందనుకున్నానా?"

"దీందుంపతెగా - ఊరొచ్చిపడ్డదికదా! తనకు తోచదూ - ఒకరుచెబితే వినదూ - ప్రతిదానికీ పెంకిపట్టూ!"

"చెబితే వినేవమ్చ్చితే ఇక లేందేఁవిటీ! ఆకమలాదేవిని చూడు? కవిత్వాలురాస్తుందీ-ఉపన్యాసాలు యిస్తుంది-రాటప్పాటలుపాడుతూ స్వరాజ్యంవాళ్లలాగు ఊరేగుతుంది-రాజభక్తిగీతాలుపాడుతూ ఉపన్యాసాలిస్తుంది-కద్దరుకడుతుంది-ఇమిటేషన్ సిల్కులు కడుతుంది-సమయానుకూలంగా సంచరిస్తోంటుంది. మనిషి అంటే అలావుండాలి-అవిణ్ణిచూస్తే ముచ్చటేస్తుంది. నిజగా-యూవన్నా గాని-మావాప్ అబ్బాయ్, ఆగంగా రావుగార్ని-సర్కారులో పెద్దఉద్యోగంచేస్తున్నాడు. ఇంటిల్లపాది కద్దరేకదా! ఆయనస్వయంగా నూలు వడుకుతాడు గాంధీగారంటే యెంతోభక్తి ఆయనకు. కాని బయటుకేఁవన్నా కనబడతాడా? బదక నేర్చిన వారి మోస్తరదీ తనకుమాల్నిధర్మం-మొదలెబ్డబేరం యొక్క-డేనావుందీ? పాడయ్యేవాణ్ణి బాగుచేసేవారూ-బాగుపడేవాణ్ణి పాడుచేశేవారువున్నారా?-యూవన్నా గానీ! ఏఁవిటోవచ్చింది మాయప్రళయం - ఎల్లాతెల్లారుతుందో ఈకాపరం.!"

"ఊళ్లో శానా అల్లరిగావుందిటమ్మా! ఇళ్లుసోదాలు చూస్తున్నారుట-లాటీల్తోబాత్తున్నారుట-అరెస్టులు జరుగుతూనేవున్నాయిట-మనకూపడుతుందేమో ఆయోగంకూడాను-ఆస్వరాజ్యపుస్తకాలేఁవిటో నెదకితీసి పిడకలకుప్పలోనేవాదాచు-దీందుంపతెగా."

"ఏఁవిటమ్మా ఆసఃఖంగుడూ?"

"సణక్కపోతే యేంచెయ్యమంటావు? ఎవర్నంటే యెవరుపడతారు? నిన్నంటేనీవు చాటుచ్చుకుంటావు-దాన్నంటే అది చీపురుచ్చుకుంటుంది. ఏం పొయ్యేగాలంచెప్పూ! ఈవాసవనూనెనీసా వట్టపడింట్లో దార్లోపడేశివెళ్లింది. అంటేకోపాలొస్తాయి. యూఁవన్నా గాని. నాకు కళ్లుకనబడతాయా బండలా? నీసాడు నూనే నేలపాలైంది. ఎల్లాపలాములైయేది అలాఅవుతూండాలి, నానార్థాలా నష్టాలుకుకష్టాలకు గురిపడ్డాం. శనేశ్వరుడు-యూఁవన్నా గాని-నెత్తినికూచోని, బాగాచెప్పుతో కొడుతున్నాడు. నాఘటంకొస్తాజారిందంటే నీవు చాలాకష్టాలుపడతావని అమారాజా ఘంటకొట్టినట్లు చెబుతుండేవారు. ఏస్వర్గంలో వున్నారో! యూఁవన్నా గాని-హారా! నాబతికేనబతుక్కి ఇప్పుడొచ్చినకడగళ్లకీ-ఏఁవనుకోను! ఏదిక్కుమాల్ని దేవుళ్లతో మొరెట్టుకోను?"

"సరే! ఇకవూరుకో-శుక్రవారప్పూటాకళ్లనీళ్లెందుకు రాలుస్తావ్-దీందుంపతెగా!-ఎవరోవస్తూన్నారు. అపాడుంకాయ కీలాగిరాలెయ్—"

### వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జినువదలి కాగితమునకు ఒక తట్టుననే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డు వ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు

# పొలిపాట

[ఫిబ్రవరి గృహలక్ష్మియందు ముప్పురు ఆంధ్రవిద్యార్థినులు సేకరించిపంపిన మూడు పొలిపాటలను ప్రచురించితిమి. మార్చిమాసపు గృహలక్ష్మియందు చిత్తూరుజిల్లాకుచెందిన ఆంధ్రవిదుషి సేకరించిపంపిన చిన్న పొలిపాటను ప్రకటించితిమి. దిగువను మూడుపాటలు ప్రచురించుచున్నాము. మొదటిది విశాఖపట్టణమండలమునుండియు, రెండవది పశ్చిమగోదావరిమండలమునుండియు, మూడవది బళ్లారిమండలమునుండియువచ్చినవి. మేము ప్రచురించినవానికి ఇతరములైన పొలిపాటలుగలుగువో సేకరించిపంప ఆంధ్రమహాజనులను ప్రార్థించుచున్నాము.
—సంపాదకుడు.]

## ౧

### (సంపాదకుడు) దేవగుప్తాపు వేంకటరమణమూర్తిగారు

పొలి: పొలో: పొలో: అనుపల్లవి ప్రతిచరణముతుదిని పాడవలెను.

పొలిగలిగి సీతమ్మా పొలిబాడుదామూ
పగితే క్రొత్తా మాశేళ్లుపోసన్నా
మనపాలనాగళ్లు కట్టించురన్నా
కొడుకుల్ని బిలిపించి కొట్లళ్లువేసీ
మనమల్ని దెలిపించి మాశేళ్లుపూసీ
ముప్పయిఐదేళ్లు పూయించినారూ
నల్లరేవడికి తోలిపెట్రన్నా
తోలినాయేళ్లోరే తోటవెంబడిసీ
తూర్పుకి పడమరకి తోలిసాలుబోసి
కొండలికిపనాంకి మరిసాలుబోసి
నల్లన్నరేవడీ తెల్లన్నదున్నీ
కాడికాడని భూమికదలదున్నేడూ
వరిపిండివర్ణాన దున్నించినాడూ
బట్టిగట్టూకాడా యేళ్లిప్పినాడూ
ఆవుల్నిదొడ్డికీ తోలిపెట్రన్నా
తీగిమేటుల్తోటి కట్టిపెట్రన్నా
యింటికొచ్చీనాడూ వెజ్జుడెలమన్నా
ముత్యాలుమునకాలు పొంజూటినేసీ
పగడాలు చెప్పుజోడూ పంచదిగనాడీ
పట్టిమంచముమీద పవ్వళించేడూ
వర్షాలులేవని వాడిపున్నాడూ
వుత్తరాన్ని మెరిసిందీ వురుముగర్జిల్లీ
దక్షిణాన్ని మెరిసిందీ ధరణిగర్జిల్లీ
గంపంతమేఘాము గాదరిల్లిందీ
చేటంతమేఘాము చెదిరికురిసిందీ.
కురిశెనూ వర్షంబూ కుంభజలనిధులూ
ముత్యాలుచెరువ్వూకి మూకుమదుమ్రులా
వజ్రాలచెరువ్వూకి వాలుగొమ్మ్రులా
పగడాలుచెరువ్వూకి పారుబట్ట్రెలా
పారుబట్టెలుగట్టీ పంటవెలమన్నా
నిండింది ఆచెరువ్వూ నీలరూపమునా
యింటికెళ్లీనాడూ వెజ్జుడెలమన్నా
గోడపైనిచ్చెనలూ మేడపైనేసీ
అటకామీదా కట్ట నేలబడదోశీ
కక్కులాకోడవళ్ల కట్టబద్దించీ
తొంగున్నలచ్చుమ్మనీ తోడచరిచిలేపి
వితనాలుపేరూలూ వివరించినాడూ
పెద్దవరిధాన్యాలు కాపోళుతిన్నా
వెలమలూతిన్నవీ వెల్లరకణాలూ
తెలగాలుతిన్నవీరా తెల్లబాలోరీ

మాలోళ్ళుతిన్నవి గవిరివజ్జాణాలూ
మురికివజ్జాణాలూ మాదిగోళ్ళుతిన్నా
శగిడోళ్ళుతిన్నవిరా చామంచనాలూ
వాయిలపాటిసన్నాలూ చాకళ్లుతిన్నా
మంగళ్లుతిన్నవిరా మల్లిసన్నాలూ
దూదిభోగములండీ దూదేకుళ్ళోద్దీ
కాకిమూతిసన్నాలూ కమసాళ్లుతిన్నా
యర్రబాలూధాన్యం యాతోళ్లుతిన్నా
కొయిదిధాన్యాలూ కోదోళ్లుతిన్నా
బలరామభోగాలూ బ్రాహ్మర్లుతిన్నా
రక్తసరిధాన్యాలూ రాచోళ్ళుతిన్నా
సుఖాసులుతిన్నవిరా సన్నసూద్రులా
బంగారుతీగెలూ ఖైరాగులుతిన్నా
బొద్దవాధాన్యాలూ బట్టోళ్లుతిన్నా
దాళవాధాన్యాలూ జాలార్లుతిన్నా
సత్తికపుధాన్యాలు సాలోళ్ళుతిన్నా
గుత్తుబాసికలూ కుమ్మర్లుతిన్నా
బుడబుడకలోళ్ళుతిన్నవిరా బుడమధాన్యాలూ
మడిలోనుపండినవీ మడిరాసికాలూ
చెరువులోనుపండినవీ చేమంచనాలూ
గుంటలోపండినవీ గుత్తుబాసికలూ
అచ్చికలుబుచ్చికలూ యెల్లంకణాలూ
మాదేవికాటికలూ మల్లిసన్నాలూ
అమ్మవారుతిన్నవిరా అమృతపాణీలూ
వితనాలుపేర్లన్నీ వివరించినాడూ
నల్లరేవడి నట్టానడిమికెళ్లేడూ
కాలుతోటీ పదునూతన్నిచూసేడూ
చేటతోవితనాలూ పట్టుకెళ్లేడూ
నల్లరేవడిమీదా జల్లొచ్చినాడూ
అప్రొద్దుపోనిచ్చీ ఆమరవనాడూ
మూడురోజుల్నాడూ ముడిమొక్కదూరీ
పందికొమ్ముల్లాగావంకటిల్లిందీ
దుప్పికొమ్ముల్లాగా దూరిందిమొక్కా
గాలివగిలీచేనూ గాదుకొన్నాదీ
హస్తకార్తికిచేనూ అటుకుకర్రోరీ
శీతకార్తికిచేనూ చిరుపొట్టదగిలీ
చవితామాసకిచేనూ చల్లనీపొట్ట
కార్తీకానికిచేనూ కడలుపండిందీ
దండేమాసకిచేనూ దండిదండిల్ని పండిందీ
నల్లరేవడిచుట్టూ తిరిగిచూసేడూ
యింటికొచ్చీనాడూ వెజ్జుడెలమన్నా
తనవూరుకమ్మర్ని తనపేరబిలిచీ
గున్నచింతలుకాడా చిరుకొలుముబెట్టీ
నేరేడుపండంటి నీలాలుపోసీ
వుల్లితొర్లావంటీ వూకపైబోసీ
నిమ్మపండొర్నార్ని నిప్పొక్కటీసీ
జోడుతిత్తులుబట్టీ బోరుకలిపెడూ
వూదేటితిత్తూలూ వురమడంబోలీ
కొలిచితూముడుధాన్యం కొలిమివేశేడూ
బంగారుకొడవళ్లూ బాగుచేయించీ
పాలోసికొడవళ్లు పదునుబట్టించీ
యేమిసికర్రాపిడులూ వేయించినాడూ
వుక్కుసేనామూతో కక్కులేయించీ
కోసినాడెలమన్నా కొన్నిగరిశలుకీ
కళ్లాన్ని పసుగూలూ వేయించురన్నా
లంకిగట్రోరన్నా పూలగబ్బన్నా
రాగిపల్లాపోతుల లంకిగట్రన్నా
పెద్దకర్రీపోతుల లంకిగట్రన్నా
గుండుగమ్మాపోతుల లంకిగట్రన్నా
నత్తిచుక్కాపోతుల లంకిగట్రన్నా
కలమతోకాపోతుల లంకిగట్రన్నా
రామలక్ష్మణఎడ్లూ లంకిగట్రన్నా

పెద్దయల్లాయడ్లా లంకిగట్రన్నా
పెద్దశ్రీయడ్లా లంకిగట్రన్నా
రాచయల్లాయడ్లా లంకిగట్రన్నా
నిలువుగొమ్ములయడ్లా లంకిగట్రన్నా
బాలియడ్లా లంకీ గట్టితేరన్నా
పాలసారాయడ్లా లంకిగట్రన్నా
ఎర్రసారాయడ్లా లంకిగట్రన్నా
కాటికాశళ్లడ్లా లంకిగట్రన్నా
చప్పికొమ్ములయడ్లా లంకిగట్రన్నా
బుర్రియడ్లాలంకీ గట్టితేరన్నా
దాకోసుతిరిగిండీ దండగడియాలూ
వలపలినితిరిగిండీ వలగజ్జపేరూ
పొలిదిరిగినోడ్డీకీ పొంగుబూరెల్రా
నూర్చినాడెలమన్నా నూరుగరిశెలకీ
జగనాలు చేకొట్టి గాలికిపోయిరన్నా
రామలక్ష్మణయడ్లా నోల్లపుయిరన్నా
గుల్లకొండాపొసుగూమండీ దోయిరన్నా
దశమిదశమీనాడూ ద్వాదశీనాడూ
శుక్రవారంనాడూ చుక్కపొద్దేళా
మంచిదొక్కొమూర్త మెంచిపడిగట్టీ
బావనారక్కడిదీ బంగారుతూమూ
గోపెమ్మగారింట గొలుసులాతూమూ
రాశిమీదాతూమూ రంజిల్లుతాదీ
తొమ్మిదొండలగరిశా లెక్కయ్యిరన్నా
గాదెలుకి యీబళ్లా పూయించురన్నా
గాదెల్లో ధాన్యాలూ పోయించురన్నా
గాదెలుకి తలుపూలూ చేయించురన్నా
తలుపులుకి తాళాలూ వేయించురన్నా
కళ్లానికొచ్చీనాడెజ్జెలమన్నా
పాలికాపుజీతాలూ తీసెయ్యిరన్నా
గొల్లోళ్లభత్యాలూ తీసెయ్యిరన్నా
బేపులుకిభత్యాలు తీసెయ్యిరన్నా
వెనకపాటోళ్లకే పీనికట్టియరా
చాకలీమడేలుకీ పందుమియరన్నా
బాలిక్కమంగలికీ పందుమియురన్నా
అమ్మాగతికిమానెడూ యిచ్చెయ్యిరన్న
యింటికొచ్చీనాడూ వెజ్జెలమన్నా
పూరుదండాశోణ్ణి పిలిపించురన్నా
పూళ్లోనిఅమ్మోరికీ చాటించురన్నా
పురటాలుపోలమ్మ ఘటమెత్తించురన్నా
తొలియేళ్లభాగోతూ లాడించురన్నా
చుట్టాలుబంధువులుకీ చెప్పించరన్నా
నవరుచుల పిండొంట లొండించురన్నా
వీధిలో శిరిమానూతిప్పించురన్నా
అశిరితల్లీగుడికీ వెళ్లొస్తుమన్నా
అనుపుకూళ్లాపెట్టీ అనిపెట్టురన్నా.

౨

(సంపాదకుడు) బొడ్డు బాపిరాజు గారు

[ఒలియ; ఒలియో; వేలుగలవాడా; రా! పొలిరా!
వెయ్‌వేలుగలవాడా! వేలసంపన్నా! పొలో! పొలో!]

అనునది ప్రతిపాదము తుదిని పాడుచుండవలెను.

పడ్డాది మాకుప్ప పర్వాతామల్లేను
కూలిందిమాకుప్ప కుంభకర్ణుడిమల్లె
విఘ్నేశుడ్ని తలవందె మాకీడేరవుపనులు
గాలిగాడినితలవంగ మా ఘనమూమెరాసి
ముందుచూస్తే యిగ్గెన్న ముంగిరూపంబు
యెనకచూస్తే యిగ్గెన్న యేనుగురూపంబు

మిట్టనోసలావాడు మిడిగుడ్లవాడు
దొప్పచెవులావాడు దొడ్డకడుపూవాడు
ఇన్నిగలస్వామికీ ఏమిపూజల్లు?
మాచేనుమాఱుదల మారేళ్లుగలవు
మారేళ్లపత్రి మాగ్గణపతికిపూజ.
మాచేనుమాఱుదల జమ్మిల్లుగలవు
జమ్మిల్లపత్రి మాగణపతికిపూజ.
కట్టావునేతుల్లు గంగరేగుపళ్లు
దోరావునేతుల్లు దొంతరటిపళ్లు
కోడెల్లునూరవంగ కొండలాపొడుగు
దున్నల్లునూరవంగ దుమ్ములాడేరాసి
శ్రీరాముకొట్టుట సీతయెదలట్టు
సీతబట్టినయెదలు చిటిముత్యాలుపండు
రఘురాముకొట్టుట రంభయెదలట్టు
వెండితూములుకింద ఎఱ్ఱడాపులుపండు
కంచుతూములుకింద కాంభోజిపండు
రాగితూములుకింద రాజనాలుపండు
తూరుపునమొదలెట్టు తుమ్మెదలమోత
పడమటామొదలెట్టు పట్టెకురవంగా
పొలిగలసీతువైతే మాపోతుమీదారమ్మి
మతిగలసీతువైతే మామండిమీదికిరమ్మి
వెయ్‌వేలు మాకిస్తె సీతుకీ వెండికడియాలు
పదివేలుమాకిస్తె సీతుకీ పైడికడియాలు
పూరుముంగటచేను పుంద్రాళ్లభోగి
పాటిమీదాచేను ఫలారానికిత్తు
గమిడిముంగటచేను మీా గద్దెకిస్తు
గణాయిపతిచ్చినపొలి చాలాపొలి
గాలిగాడ్పితలవంగ మాఘనమామెరాసి
వెయ్‌వేలుగలవాడా! వేలసంపన్నా!
ఒలియ;ఒలియో;వేలుగలవాడారా!పొలిరా!

3

(సంపాదకుడు) శెట్టిపల్లి వేంకటరత్నముచౌదరిగారు

పొలియొ, పొలియొ
వెయివేలుగలవాడ! వేలజంపన్న!
చిప్పతోగంధంబు చిరుశెనగపప్పు
ఒప్పయిన గణపతికి ఒనరంగపూజ.
మాచేనుమారుదల రెండుజమ్ములుగలవు
జమ్మిపత్రిక దెచ్చి మాగణపతికిపూజ.
మాచేనుమారుదల రెండుమారేళ్లుగల
మారేడుపత్రికా మాగణపతికిపూజ.
ఒప్పయినగణపతికి చప్పెడుంద్రాళ్లు
భక్తితోపూజించి ముక్తిపొందేము.
అసరసవిద్యలకు ఆదిగురువై నట్టి
మాగణపతిని పూజించి గణతగాంచేము.
మాచేనుమారుదల రెండువెలగలేగలవు
వెలగపత్రిక దెచ్చి మాగణపతికిపూజ.
తేనెతోమాగిన తియ్యమామిడిపండు
ఒప్పయినగణపతికి ఒనరంగపూజ.
మల్లెపువ్వులుదెచ్చి మాగణపతినినెపుడు
మతియందుధ్యానించి మరిపూజసేతు.

పల్లెటి సీమలందు ప్రచారమునసున్న ఇతరపదములనుగూడ సేకరించిపంపుచో వందనపూర్వకముగ సందుకొని గృహలక్ష్మిలో ప్రచురింపగలమని మనవి.

—సంపాదకుడు.



గౌరీపూజ

[శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతముగారు, చిరంజీవి సీతామహాలక్ష్మి (లక్ష్మీకాంతముగారి పెద్దకూతురు), శ్రీమతి జొన్నలగడ్డ శారదాంబగారు.]



శ్రీ ఓరుగంటి మహాలక్ష్మమ్మగారు



శ్రీ కట్టా శంకరమ్మగారు



శ్రీ దిగుమర్తి జానకీబాయిగారు



శ్రీ వద్దిపర్తి శకుంతలాదేవిగారు



శ్రీ కె. శే. కొమ్మారెడ్డి కమలా
జగన్మోహినిగారు

## ప్రభాతము

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మ గారు.

అణగిన భారతోద్ధరణకై పలుపాటుల గాటపున్ శ్రమన్
గణనకుతేక, నీటివలిగాష్పుల దోగిన నీపనీలిమ
ప్రజ్ఞుతి నసల్దోడంగి తెలిబారినచెక్కిలి గ్రమబాష్పకం
కణమునురాల్చు తెన్గుచెలి! కాంచుమవేకువచుక్కయూనదే.
కలవరపాటు మానుమిక గాఢతమచ్ఛటలెల్ల మాయమై
వెలవెలయాకసంబు తెలివింగనె నిద్దురమత్తుకన్నులన్
జలములనొత్తి కాంచుమదె జ్వాలగమండెను నాజతీంద్రుకో
పల తల శోణిమారుణిమ ప్రజ్వలకాంతుల నాంధ్రసోదరీ!
బిక్కమొగంబదేల? పరవింగను నీదువిధిక్రమంబు, నీ
యక్కలు మున్నుచూపి వినయంబుననాను ప్రశాంతభాషణం
బక్కరపంక్తి వ్రాయసలవా? వినుమెల్లెడ వేయిగొంతులన్
'క్లొక్కరు' మంచుకోళ్లయి ప్రకోపితపత్రికలార్చెమన్ చెలీ!
జలజలమేనిపై పులకసంగతినించి వినిద్రమాంద్యముల్
తెలివిగనంగవీచు బుధధీరవనావళి సౌమనస్యవా:
కలితమృదూష్మపోతములు; కాయము తెల్లడమందు, డెందము
న్నిలువున నీరుగాకరగు నిర్భయదేశవికాశసేవల౯.
సత్తును దప్పడంట, బుధసత్తములందున నగ్రగణ్యుడం
టుత్తవిపాలు పచ్చికసయుందిని దేహమునిల్పునంట, వా
మెత్తిన ముత్తెపున్నగవులెత్తుగ రాలెమనంట, వేకువ౯
పుత్తడిపోటు మేలుకొలుపుల్ స్మృతిబాను మహాత్ముడెవ్వడో!
ఉత్తరశీతవాతములయార్పులు దక్షిణతీరభూమిపై
రొత్తక మున్నె లేచి మనసోదరి 'రుక్మిణి' ప్రాచివీథులం
దొత్తుగజల్లి రంగవెలుగులుంచుచుబోయి వినిర్మలాత్మతన్
బత్తిదెమల్చె కృష్ణభగవానుని గేహము జూడబోదమా!

# తోరుదత్తు

శ్రీమతి వి. యస్. నారాయణిఅమ్మగారు

ఆధునికాంగ్ల యువతీకవితాలోకమున అనితరసంలభ్యమగు యశమునుగాంచి ప్రసిద్ధిజెందిన తోరుదత్తను హిందూసుందరి 1856-వ సంవత్సరమున కలకత్తానగరమున జన్మించెను. పాశ్చాత్యవిద్యాభ్యాసముచేసి వినుతికెక్కిన విదుషీమణులలో నీమెనే మొదట చేర్కొనవలెను. తరులతయను నామాంతరమీమెకుగలదు. తరులత తండ్రియగు బాబు గోవిందచంద్రదత్తుగారు క్రైస్తవమతమును స్వీకరించిన హిందువుడు. కలకత్తానగరమున కొన్నిదినములాతడు న్యాయవాదిగ పనిచేసియుండెను. అతడు తన పెద్దకుమార్తెయగు అరూబాయికిని, అబాజీ అను పుత్రునకును, కడపటికుమార్తెయగు తరులతకును ప్రాథమికవిద్యగఱప శివచంద్రబెనర్జీగారిని ఆచార్యులుగ నియమించెను. తక్కిననిరువురు బిడ్డలకంటె చిన్నదగుటచే తరులతనుదత్తుగారు మిక్కిలిగారాబమున జూచుచుండిరి.

ఇంచుమించుగ తనబాల్యమునంతయు తరులత కలకత్తాయందే గడపెను; ఆమెకు పదమూడేండ్లు వచ్చువరకు ఆకుటుంబము కలకత్తాలోనేయుండెను. పదమూడేండ్లలో నొకసంవత్సరకాలము మాత్రము బొంబాయిలో గడపిరి.

తరులత చిన్ననాటనే ఆంగ్లకవితాపితామహుడగు జాన్‌మిల్టన్‌రచించిన గ్రంథములను జదివి అందలి అర్థమును, సారమును గ్రహింపగలిగియుండెను. నిజముగ నిట్టిబుద్ధివైభవము నిరుపమానమనియు, దైవప్రేరితమనియు భావింపనగును. కాదేని అంతటికవీశ్వరునిచే రచింపబడిన గ్రంథములనుగూర్చి భారతమహిళ యెన్నడైన కర్ణాకర్ణిగనైన వినెనా? పురుషులలోకూడ చాలమంది కామహాకవీశ్వరునినామమే తెలియదు. తరులత ఆంగ్లమహాకావ్యముల రసమును గ్రహించి, తదితరాంగ్లేయబాలికలకన్న భాషాజ్ఞానమునను, అర్థజ్ఞానమునను మించిపోవుచుండెడిదట!

1869-వ సంవత్సరమున—అనగా తరులత పదమూడవయేట అబాజీమరణించెను. అప్పటినుండి బాబు గోవిందునకు "గోరుచుట్టుపై రోకటిపోటుబగిది" భార్యావియోగదుఃఖముతోబాటు పుత్రశోకముగలపెను. పుత్రశోకసంజనితమగు మనోవ్యథను మాన్పుకొన తనకు పుత్రికలే పుత్రులనిభావించి దత్తుగారు వారికి వలయు విద్యాబుద్ధులు గఱపుచుండిరి. పుత్రికల విద్యాభ్యాసమునకై విదేశములకేగిరి.

మొట్టమొదట ఆకుటుంబము ఫ్రాన్సుదేశమునకేగెను. నీస్‌నగరమున సోదరీమణులిరువు రొకప్రాథమికపాఠశాలలో ప్రవేశించిరి. కొన్నిదినములైన తరువాత వారిరువురు నవీననాగరికత కునికపట్టగుప్యారిస్ నగరమున నించుకంత విద్యాభ్యాసమొనర్చిరి; ఫ్రెంచిభాషాపరిచయము చాలవరకుకలిగెను. మరికొంతకాలమైనతరువాత దత్తుగారు పుత్రికలిరువురనుదోడ్కొని ఇటలీదేశమునంతయు, జూచి ఇంగ్లాడును జేరిరి. అరూతరులతలు కేంబ్రిడ్జివిశ్వవిద్యాలయమున పారమురముగవిద్యనభ్యసించిరి. తరులత యూరప్‌దేశమందలి తనదినచర్యనంతయు నొకపుస్తకమున వ్రాయుచుండెను.

1873-వ సంవత్సరమున గోవిందచంద్రుడు తనకుమార్తెలనుదోడ్కొని కలకత్తాకుమరలివచ్చెను. తరులత ఆంగ్లేయమందును, ఫ్రెంచియందును చాలపాండిత్య మలవరచుకొనినదగుటచే దత్తుగారామెను గద్యపద్యకావ్యములు రచింపమిగుల ప్రోత్సాహపరచుచుండిరి. అరూబాయి పాశ్చాత్యభాషాపరిజ్ఞానము తరులతతో సమానముగ సంపాదించెను. కాని తెలివితేటలందును, ఊహాపోహాపరిజ్ఞానమందును తరులత అసమానప్రజ్ఞాభావదురంధరురాలయ్యెను. అరూబాయికి చిత్రలేఖనమన్న మిక్కిలిప్రీతి. కావుననే తరులత గ్రంథరచనకును,

ఆరూబాయి వానికనుగు చిత్రములు గీయుటకును, సోదరీమణులిరువురును నియమించుకొనిరి. దత్తుగారు తరులతకు సంస్కృతమును నేర్పుచుండిరి. అచిరకాలముననే తరులత కాళిదాసాదిసత్కవికుమారులు రచించిన కావ్యములు అనర్గళముగ జదువనేర్చెంగెను. "వ్రేలుచూపిన మండ్రమింగువట్లు" ఆకవయిత్రి కావ్య పఠనముచే తృప్తినొందక కావ్యరచనకు గడంగెను. కవిత్వమునకుతోడు సంగీతముకూడ బాగుగా నెరింగెను; వివిధములగు వాద్యవిశేషములను మిగులశ్రద్ధతో ఒకగానవిద్యావిశారదునిచెంత నేర్చుకొనెను.

ఆరూబాయి 1874-వసంవత్సరమునక్షయరోగపీడితరైపరలోకగతురాలయ్యెను. తరులత సోదరీవియోగమును సహింపలేక కడుపెద్దకాలము కుందుచుండెను. ధైర్యమువిడువక గ్రంథరచనను సాగించుచుండెను.

ఆమె జీవితమున మరినాల్గుసంవత్సరములే శేషించియుండెను. ఆనాల్గుసంవత్సరములు, తరులత, బాల్యమున నామెనివసించిన పురాతనగృహమునందే గడపెను...సంస్కృతభాషాపరిచయము బాగుగాగలిగిన తరువాత ఆంగ్లేయగ్రంథములు ఫ్రెంచిలోనికి, ఫ్రెంచిగ్రంథము లాంగ్లేయమునకును భాషాంతరీకరణ మొనర్చుచు బాంగాళాదేశపువార్తాపత్రికలలో అసంఖ్యాకములగు వ్యాసములును, గద్యపద్యమాలికలును వ్రాసి ప్రకటించుచుండెను. 1876-వ సంవత్సరమున తనప్రియజననికి కృతియొసంగిన ప్రథమపద్యసంపుటము **(A Sheaf gleaned in French fields)**ను ప్రచురింపజేసెను. అందలి పద్యమాలికలన్నియు ఫ్రెంచినుండి ఆంగ్లేయమునకు భాషాంతరీకరించినవే; కాని శబ్దసౌష్ఠవమును, మధురమగుపదరసయు భాషాంతరీకరణగ్రంథ మనుభావమును మరపించును: శైలిమృదుమధురమై యుక్లిష్టముగ గన్పట్టును. కాని యేకారణము కలవనో, ఈగ్రంథమును ప్రజలుకాని పండితులుకాని ప్రశంసింపకుండిరి. తుదకది ఎడ్మండ్ గాస్సీ— **(Edmund Gosse)**అను నాంగ్లేయకవిపుంగవుని యమూల్యవీక్షణముల నాకర్షించెను. అతడు తరులతయొక్క కవితానైపుణ్యమునకును, కల్పనాచాతుర్యమునకును, భావనాశక్తికిని మిక్కిలియచ్చెరువు పొందెను. అంత నాకవితల్లజు డాగ్రంథమును ప్రశంసించుచు ఒకపీఠికనువ్రాసి లోకమునకు నివేదించెను. గ్రంథమును జూడకయే మొదట నిరాకరించిన వారెల్లరును పశ్చాత్తాపపడి పాశ్చాత్యకవియొక్క ద్వితీయముద్రిత గ్రంథమును గౌరవించుచు జదువసాగిరి; విద్యాశాఖాధికారులు ఆగ్రంథమందలి చిన్నచిన్న భాగములను పాఠశాలలందు బాలబాలికలకు పఠనీయములుగ నియమింపసాగిరి.

తరులత ఆంగ్లేయవాఙ్మయపీఠము నూతనప్రఫుల్లవికసితపుష్పచయముచే సౌందర్యముగనుండునట్లలంకరించి ఆంగ్లయువతీకవితాలోకమున అనన్యసాధారణమైన పాండిత్యముచే అపరభారతివలె మెలంగెను. భారతమహిళయొక్క ప్రజ్ఞావిశేషము పాశ్చాత్యులకు చవిజూపి. దేశమునకు కీర్తిసంపదలచే వన్నెగలుగజేసె ననుటతిశయోక్తి కానేరదు. కావుననే గాస్సీకవీశ్వరుడును మనహైందవకవయిత్రియొక్క జీవితచరిత్రకూడ పందొమ్మిదవశతాబ్దపు ఆంగ్లేయకవులచరిత్ర వ్రాయునపుడు స్మరించుచు లిఖింపవలెనని పీఠికలో చదువరులకు వ్రాయుచున్నాడు. 19-వ శతాబ్దమున తరులతతో సమానముగ ఆంగ్లేయఫ్రెంచిభాషలందంతపాండిత్యము పాశ్చాత్యస్త్రీలలో నొక్కతెయైనను సంపాదింపగలిగియుండలేదు. తరులత భారతీయులందు జన్మించియు పరభాషాపరిచయము పొందినందుకు మొదట శ్లాఘింపవలసియున్నది. పరభాషయైనను స్వభాషయందువలె కవనముచెప్ప గడంగుటయు, కావ్యలక్షణముల ననుసరించి రసపోషణ మొనరించుటయు మిగుల ప్రశంసనీయములు. ఆమె రచించిన గ్రంథములలో కొన్నిభాషాంతరీకరణములైనను కవనము మృదువుగను, మనోహరముగను నుండి స్వకపోలకల్పితమువలె గన్పట్టును. ఆయమ రచించిన "ప్రాచీనహిందూస్థానమందలి పాటలు" అనుమహాకావ్య మాంగ్లేయకవితాలోకమున మిక్కిలి పొగడ్తనుగాంచెను.

1877-వ సంవత్సరమునుండియు రోగపీడితరాలై శయ్యఁజేరుటచే ఆమె సదాశయమున కించుకంత అంతరాయముగల్గెను. అప్పటినుండియు అమె గ్రంథరచనకర్త్రియై చదువబూనెను. ఆసంవత్సరము జూన్ 30-వ తేదీ నామె "క్లారిస్సెబోడేర్" అను ఫ్రెంచివిదుషిచే రచింపబడిన యొక ఫ్రెంచిగ్రంథమును అంగ్లేయ భాషలోనికి భాషాంతరీకరింపదలచి తద్గ్రంథకర్త్రియనుజ్ఞ నపేక్షించుచు,అమె కొకజాబును వ్రాసెను. అమె దయతో భాషాంతరీకరింపవచ్చునని అనుజ్ఞనొసఁగి జవాబువ్రాసిపంపెను. తరులత తదుపరి కృతజ్ఞతా పూర్వకముగ వందనములర్పించుచు తనచిత్రపటమును సంస్కృతమునుండి ఫ్రెంచిభాషలోనికి తర్జుమా చేయ బడిన కొన్ని పద్యములను ఫ్రెంచికపత్రికం పెను. అపద్యమాలికల మృదుమధురశైలి కామెయచ్చెరువందెను; తరులతయొక్క కవితాధోరణికి మిక్కిలి శ్లాఘించెను. ఫ్రెంచిగ్రంథములను తర్జుమాజేయక పూర్వమే భగ వంతు డావిదుషీమణియొక్క సదాశయమునకు విఘాతమును గలిగించెను.

ఇరువదియొకటవయేట అరునెల లిరువదియారుదినములైన తరువాత 1877-వ సంవత్సరమున అగస్టు నెల 30-వ తేదీని కలకత్తానగరమున మానిక్టోలావీధిలోని తనజనకుని గృహమున తరులత భౌతికశరీరమునువీడి అంగ్లకవితాకుటుంబమును దుఃఖాంబుధిబడద్రోసి పరలోకమున కేగెను.

గోవిందచంద్రదత్తు ఆమెరచించిన తొమ్మిదికావ్యము లొకగ్రంథముగా నచ్చువేయించి ప్రకటించెను. వానిలోని కొన్నికావ్యము లదివరకే కలకత్తారెవ్యూ, బెంగాల్ మ్యాగజీన్ (Calcutta Review and Bengal Magazine)అను పత్రికలలో ప్రచురింపబడెను. ఆమెచే రచింపబడిన కొన్నిఅంగ్లేయపద్యరత్నము లీక్రిందిశీర్షికలచే నొప్పుచున్నవి: "లక్ష్మి; సావిత్రి; ధృవ; ఉమ; సింధు; సరసిజము; సరుగుడుచెట్టు (Casuarina tree) జీవితవృక్షము;" తరులత తనకంత్యదశవచ్చునరి కొకఫ్రెంచికథను వ్రాసియుంచెను. "బాడేర్" అను ఫ్రెంచికపత్రి అగ్రంథమును పొగడుచు పీఠికనువ్రాసి ప్రచురింపజేసెను.

యశోవిరాజితములైన యీయమరచించిన గ్రంథములను ఆంగ్లభాషాపరిచితిగల పాఠకులనవరతము పఠనీయగ్రంథములనియెంచి పఠించి యందలిరసము గ్రహింతురుగాత!

## అనార్కాలి

దామెర రాజగోపాలరావుగారు

మామకీనగృహారామసీమలోనఁ
జారునిర్మలకాసారతీరమందుఁ
జొక్కటమ్మగుదానిమ్మమొక్కయొకటి
పెంచుకొనుచునున్నాఁడ నేఁ బేర్మితోడ.
కొన్నినాళ్లామె; అంతనాచిన్నిమొలక
బాలపల్లవసంగతప్రాంశువిస్తృత
మంజులమహీరుహంబుగా మారిపోయి,
పాలుపుమీఱంగఁ దానొక్కపూవుఁబూచె.
సలలితోద్యానములయందు సౌఖ్యగతిని
సంచరించెడి షట్పదచక్రవర్తి;
సంతతామోదహేలాసుశాంతమూర్తి;
మించునెమ్మి నద్దానిఁ బ్రేమించియుండె.

అది మనోజ్ఞప్రశాంతసంధ్యాసమయము;
స్ఫారఝంఝూసమీరప్రసారవేల్లి
తాగమమునుండి, అయ్యయో! ఆసుమమ్ము
సడలివెడఁదంపుఁ బుడమిపై వడివడిగ.
ఇంకనచ్చోట నాబంభరేశ్వరుండు,
దనదుప్రాణేశ్వరిని యెదఁదలఁచితలఁచి;
వాడి; యుద్దవడిఁ దడవు వగచివగచి;
భూరివిమనార్ణవమ్మున బ్రుంగెనకట!
అరుణసహాకారవిటపీలతాగ్రమందుఁ
గూరుచుండిన యొకమదకోకిలంబు
అన్నితాంతకఠోరదృశ్యమునుగాంచి
శాంతముగఁబాడె నొక్కవిషాదగీతి.

సారజ్ఞుఁడవు నీకు సకలంబు తెలియు,
వారక నే జెప్పవలసిన దేమి?
యారూఢిగానిది యసురకృత్యంబు.
నేఁడుమావిజయుండు నిన్నుబట్టికొని
యీడకుఁగొని తెచ్చి హింసించుననుచు
చింతించి నారీతిఁజెదరి మాతల్లి
యెంతశోకించునో యింటిలో వ్రాలి'
యనియిటువగచి కృష్ణార్జునుల్ వినఁగ
నెనరుతోఁబల్కె నానెలఁతయిట్లనుచు:
'ఓకృపామతులార! ఓపుణ్యులార!
యాకృపి ద్రోణుతో నగ్నిలోఁబడక
తనయునినమ్మి యిద్ధరనున్న దిపుడు
గనుకనీద్రౌణి నిక్కడవధించినను
అయింతి పుత్రశోకాతురయైన
నాయాత్మసుతులఁ బ్రాణములురాగలవె?
ధారుణీసురులకు ధారుణీపతులు
భూరిశోకంబును బుట్టింపరాదు.
ఆశోకవహ్ని భూపారణ్యములను
పాశిచందమునఁగాల్పక శాంతమగునె?
కనుక నీవిప్రుని గావరే'యనుచుఁ
గనికరంబును నీతిగనిధర్మసరణిఁ
దోఁపఁగాఁబల్కెనందుకు ధర్మరాజు,
నాపద్మలోచనుం, డాయర్జునుండు,
సాత్యకి,నకులుండు, సహదేవుఁడపుడు
సత్యమింతేనని శాంతులై రందు
సమ్మతింపక మదిచలము రెట్టింప
సమ్మారుతాత్మజుఁడపు డిట్టులనియె:
'తనకొడుకులఁ జంపె దారుణకర్ముఁ
డనక ద్రౌపది వీనికక్కటయనుచు
వీఁడు బ్రాహ్మణుఁడంచు విడువుమటన్న
వీఁడు నిజంబుగా విప్రసంభవుఁడె?
పాంచాలిమాటలే పాటిగానెంచి
మంచిదియని శాంతిమంతులై వీని
మీరుచంపకయున్న మీఱినేనైన
క్రూరాత్ముఁడగు వీనిగ్రుడ్లువెల్కుఱక
పిడికిటపోటులన్ భిన్నముగాఁగఁ
బొడిచి వీనిశిరంబు భువినడంచెదను
వారింపమీరు రావల'దంచుఁబలికి
వీరుఁడై ద్రౌణిపై విడిబడిగదసె.
నప్పుడశ్వత్థామ కడ్డంబుగాను
తెప్పున ద్రౌపదీదేవి తావచ్చె;
నంతటనిలువ కయ్యనిలనందనుఁడు
పంతంబుతోడ ద్రౌపదినటుద్రోసి
చనుచున్న భీముని సంరంభమపుడు
గని చతుర్బాహుఁడై కమలలోచనుఁడు
రెండుచేతుల భీము రెట్టలుబట్టి
నిండినబలముతో నిల్పి శీఘ్రముగఁ
దక్కిన రెండుహస్తముల నాద్రౌణి
నక్కరగాఁబట్టి యావలఁద్రోయ
నావేళ పాంచాలి యనిలజుమోము
భావించి నవ్వుచుఁ బలికెనిట్లనుచు:
"నిదియేమి? పుణ్యాత్మ! యీమహీసురుని
పదరి వధించుట పాడియే నీకు?
ధర 'బ్రాహ్మణో నహంతవ్య'యటంచు
నిరవొంద వేదార్థ మెఱుఁగవే నీవు?
మాన్యుండువిప్రుం డేమాడ్కి చూచినను,
ధన్యాత్మ! నీకింత తామసంబేల?
బాలకులు ఋణానుబంధముల్ లేక

గూలిపోయిరి; మనకొడుకులేవారు?
అక్కటా! శిశుహత్యకలఁడులోనయ్యె,
నిక్కడ మనకేలనీబ్రహ్మహత్య?
నీ వన్ని దెలిసిన నిర్మలాత్ముఁడవు,
కావున ద్రౌణినిగాచిరక్షించు"
మనియిట్లు మృదుమధురాలాపమునను
జనవున భీముని శాంతిబొందించె.
నంతట శ్రీకృష్ణుఁ డనిలజుపీడి
సంతోషచిత్తుఁడై శక్రనందనుని
గాంచియిట్లనె: 'నేను, కరువలిపట్టి,
పాంచాలిజూడ నిర్భయుఁడవై మున్ను
నెలఁత ద్రౌపదితోడ నీవుప్రతిజ్ఞఁ
బలికినరీతి నాపంపుగావించు'
మనిసంజ్ఞ గాఁజూప నర్జునుండపుడు
మనములోనగ్రహించి మంచిదటంచు
నరిగియశ్వత్థామ ఔదలఁబట్టి
కరవాలమున వెంట్రుకలు తెగఁగోసి
యతనిశిరోరత్న మపుడుబుచ్చికొని
ప్రతిభ దీపింపఁ దా బంధించియున్న
పాశంబువిడిచి' విప్రా! పొమ్మటంచు
నాశిబిరము వెళ్ల ననిచె. నవ్వేళ
తనశిరోరత్నంబు తనప్రకాశంబు
నొనరకౌంతేయుల కొప్పించితలఁగి
తగ్గుచు బాలఘాతకుఁడైన కతన
సిగ్గుచేఁదలవంచి చింతతోనరిగె.
కావున నవ్విప్రుఁ డెక్కడనైనతప్పు
గావించినను రాజు ఖండింపరాదు;
మఱియేమిశిక్ష బ్రాహ్మణులకటన్న
గుఱుతుగాధనమైన గొనవలె, నెత్తి
గొఱిగించవలె, వెళ్లగొట్టంగవలయు,
వెఱవంతియేగాని విప్రులఁబట్టి
పొరిగొన్న పాపంబు భూపాలకులకు;
హరియుఁబాండవులు ధర్మాత్ములుగనుక
ద్రౌణి నివ్విధమునతగుశిక్షజేసి
ప్రాణముల్ రక్షించి పంపించిరవలఁ
బనిబూనిపాండవుల్ పాంచాలితోడఁ
దనయులకును, బంధుతతులకునేడ్చి
వరుసగామృతులైన వారికందఱకు
మఱిదహనాదికర్మము లాచరించి
తరుచుగా స్త్రీల ముందరనిడుకొనుచు
హరియుక్తులై గంగ కరిగియచ్చోట
విమలులై కర్ణాదివీరులకెల్ల
క్రమముగాను తిలోదకంబులనిచ్చి
క్రమ్మరవిలపించి గంగలోమునిఁగి
యమ్మహాత్ములు చింతనందున్న వేళ
కనలుచు నంధుండు, గాంధారి యాత్మ
తనయులకేడ్వఁగా ద్రౌపది, కుంతి
యడలుచునుండఁగా నంబుజాక్షుండు
తడయక మునులతోఁ దానూరడించి
యందఱఁదోడ్కొని హస్తిపురంబు
పొందుగాఁజేర్చె. నప్పుడు ముదంబెసఁగ
కౌరవసమితి నీకరణిఁజంపించి
యారాజ్యమంతయు నమరఁగా ధర్మ
తనయునకిప్పించి తాసంతసించి
యనుపమంబైన మూఁడశ్వమేధములు
జేయింతునతనిచే సిద్ధంబటంచుఁ
బాయకమదిని సంకల్పంబుఁజేసి
వాసుదేవుండంత వ్యాసాదిసకల
భూసురావళిచేతఁ బూజితుఁడగుచు
బలముగాసాత్యకి ప్రముఖులచ్చోట
గొలువఁగాద్వారకకున్ బోవ మదిని
గోరి పాండవులవీడ్కొని దివ్యరథము

—ఉత్తరాగర్భస్థుండగు నర్భకునిరక్షణము—

పై రయంబుననెక్కి పైనమైనపుడు
తత్తరింపుచును రథంబుడగ్గరికి
నుత్తరవచ్చి పద్మోదరుఁజూచి
స్రుక్కుచు శిరమువంచుచును లజ్జించి
మ్రొక్కికరంబులు మొగిచియిట్లనియె:
"దేవదేవ! మహాత్మ! దేవకీపుత్ర!
నావిన్నపమువిను, నన్నుమన్నించు,
మనలంబుగ్రక్కుచు నస్త్రమిచ్చటికిఁ
జనుదెంచె,నదె చూడు సర్వశరణ్య!
యొదిగినాగర్భమందున్న చేతనుని
పొడువవచ్చెను దీని పొంగణంగించు
మనఘాత్మ!నీ చెల్లెలైన సుభద్ర
తనయుఁడాజినినాకు దశలేనికతన
మడిసినందుకు శోకమగ్నాత్మయగుచుఁ
గడలేనిచింత చేఁ గనలుచుండియును
మనములోనొకవేళ మనుమఁడుబుట్టు
ననితానెదురుచూచు, నక్కట! నీవు
మాయుత్తభేదంబు మఱచియుండుటకు
నాయందుదయయుంచు నాతండ్రి! యిపుడు,
పసమీరశిశువును బ్రతికించి యింట
పసిబిడ్డమెలఁగు నుపాయమూహించు,
గర్భంబులో ననేకములై నపద్మ
గర్భాండములఁదాల్చి కడతేర్చుచున్న
నీకు నాగర్భంబునేకు రక్షించు
టేకష్టమిది నిర్వహింతవుగాక"
యనుచును త్తర'హరి! హరి!'బ్రోవ
మనుచుమొనసి దీనాలాపములుబల్కుతరిని
చటులోగ్రమగుచు నశ్వత్థామశరము
పటుగతిరాఁజూచి పాండవుల్గినిసి
లడయక ప్రత్యస్త్రతతులనందికొని
విడిబడిపోరాదువేళ కృష్ణుండు
ఆపాండవాత్మజు లదినివారింప
నోపలేరనుచుఁ దానుకుపఁదలంచి
కనులెర్రఁజేసి కర్కశముతో ద్రోణ
తనయుశరంబుపైఁదనచక్రమేసె.
నాదివ్యతరచక్ర మగ్నిచందమున
దేదీప్యమానమై దిశలుగంపింప
నప్పుడశ్వత్థామయస్త్రానలమును
దెప్పునచల్లార్చి దివిజులుబొగడ
హరిచెంతఁజేరెనయ్యది పొలుపొంద.
నరయకృష్ణుఁడు పాండవాప్తుఁడౌటెఱిఁగి
మూఢుఁడశ్వత్థామ మొనయుక్రోధమున
రూఢుఁడై బ్రహ్మశిరోనామకంబు
నప్పుడేసిన దానియలఘుతేజమును
దెప్పున వైష్ణవతేజం బణంచె;
నప్పరమేశ్వరుం డతిసూక్ష్మకథుఁడు
తప్పక సకలచేతనులందు వెలుఁగు
గావున నుత్తరగర్భస్థశిశువు
నావేళరక్షించె నాద్రోణసుతుఁడు
అహితవృత్తి నపాండవాస్త్రమేసినను
రహిని ప్రతిక్రియారహితమీశరము
గనుకపాండవులచేఁగాదు వారింప
నని కురుసంతానమవని నిల్పుటకుఁ
దనచక్రమున తదస్త్రమునుమాయించి
పనిబూనిక్రమ్మఱఁ బైనంబుగాఁగ

—కుంతీదేవి శ్రీకృష్ణుని నుతించుట—

ధర్మరాజాదులు, ద్రౌపది, కుంతి
కూర్మిరెట్టింప నాగోకులోద్ధరుని
చెంతకువచ్చి రంచితభక్తితోడ
కుంతియిట్లనియె: నాగోవిందుజూచి
"పురుషోత్త! మానంత! భువనైకపూర్ణ!

పరమేశ్వ! రాచ్యుత! ప్రణుతులునీకు;
జవనికచాటున జనుఁడుండివేడ్క
నవరణనాట్యంబు సల్పుచుఁదాను
సాలభంజికలను జాలనాడించుఁ
బోలికగా సర్వభువనంబులందు
నీవు మాయజవనికమఱుంగునను
భావనాతీతప్రభావతనుండి
కపటనాటకసూత్రకలితుండవగుచు
నెపుడునటింపుచు నీజనంబులను
ఆడింపుచుందుదు, వహాహా! నీమహిమ
నీడ నుతింపనేనెంతటిదాన?
పరమహంసలు, మునుల్, బ్రహ్మాదిసురులు,
పరమయోగీంద్రులు, పండితాగ్రణులు
మొనసినీనిజరూపమును నిజంబుగను
కనఁజాలరందురు. కావునమేము
మనుజమాత్రులము, పామరులము నిన్ను
గననేర్తుమే స్వప్రకాశా! ప్రమేయ!
పొలుపొందు యదుకులాంబోధిలోనీవు
నలలితపరిపూర్ణచంద్రునిమాడ్కిఁ
బొడమి లాక్షాగృహంబున నన్ను, సుతులఁ
బడిపోవనీయక బ్రతికించినావు,
బెట్టుగాకురురాజు బెట్టించినట్టి
పట్టెనవిషముచే పవననందనుఁడు
మడిసిపోకుండ సమ్మతిఁబ్రోచినావు,
తడయకకౌరవుల్ ద్రౌపదీదేవి
వలువలువిడువ నవ్వనితమానంబు
తలఁగిపోనీయక దక్కించినావు,
గాంగేయకుంభజకర్ణాదివీర
పుంగవు లుద్ధతిఁబోరువేళలను
కన్నుగాచినరెప్ప కై వడిఁగాచి
మన్నింపుచు నాకుమారులకెల్ల
జయధైర్యములనిచ్చి శత్రులుజూపు
భయములదప్పించి పాలించినావు,
అరసిచూడ ప్రతిక్రియాశూన్యమగుచు
పరవినాసుతుల కసాధ్యంబునగుచు
వచ్చుచున్నట్టి యశ్వత్థామశరము
నచ్చోటవుగ మాయ నతితీవ్రగతిని
దాని వారించి యుత్తరతాపమార్చి
యూనాతిగర్భస్థమైన పిండమును
రక్షించితివి నీవు, రాజీవనేత్ర!
మోక్షదాయక! సర్వమునినుతిపాత్ర!
బహుక్రూరుఁడగు కంసు బాధదప్పించి
రహినిమాతల్లిని రక్షించినటుల
నన్నుకౌరవులచే నలఁగిపోనీక
మన్నించు నీమేలుమఱతునేనేను,
క్రమముగా ధర్మార్థకామభోగములు
నమరనంటకయె నీయందురమించు;
కాలరూపకుఁడవు, కల్యాణగుణుఁడ,
వాలస్యరహితుఁడ, వఖిలపూర్ణుఁడవు,
సర్వసాక్షివి, సర్వశక్తియుక్తుఁడవు,
జననకర్మంబులెచ్చట లేనినీవు
ననఘ! లోకవిడంబనార్థంబుగాను
అవనిపై మీనకూర్మాదిరూపముల
నవిరళమతిదాల్చి యఖిలదుష్టులను
నమయించి, బ్రోతువు సకలసాధువులను;
నమలాత్మ! నీవుకృష్ణాభిధానమున
బాలునిరీతి వ్రేపల్లెలో వెన్న
పాలు బ్రుచ్చిలినట్లు బలువినోదములు
జేయఁగా నినుబట్టి శిక్షింప రోల
నాయశోదాదేవి యులిగికట్టినను
బలహీనుఁడై న డింభకునిచందమున
పలుమారు కన్నులుబట్టినల్పుచును







# ఆశీస్సు

నూకల సత్యనారాయణశాస్త్రిగారు

సర్వగ్రంథసముద్ర రాజతనయా
స "ద్వైశ్యలక్ష్మీ" స్సతీ
దాసీభూతసమస్తహైందవవధూ
స్సచ్చిత్రచిత్రాకృతిః
నానాఽజ్ఞానసముద్రమగ్నయువతీ
సందోహరక్షోన్ముఖీ
శ్రీముద్రాలయవారిజాతనిలయా
త్యుచ్చైశ్చిరం వర్థతాం.









కృష్ణకుమారి కన్య సినీమానటి

***Courtesy of Messrs Ratilal Bros. Bombay.***

కుసిలించుకొనుచు నాగోపికల్ జూడ
ముసిముసినవ్వుతో ముద్దుజూపుచును
మొనసిన నీబాల్యమూర్తిభావించి
దనుజారి! నేనద్భుతంబందుచుందు.
వలనొప్ప దేవకీవసుదేవులొనర
నలరారు భక్తి జన్మాంతరంబులను
దలఁచఁగాఁ జక్రి యాదవకులంబులందుఁ
బొలుపొందఁ గృష్ణుఁడై పుట్టినాఁడనుచుఁ
జిరముగాఁగొందఱు జెప్పుచుందురు;
మఱికొందఱిలను ధర్మజునిసత్కీర్తి
అలమలయమునఁ జందనముచందమున
వెలయఁజేయను బ్రభవించినాఁడనుచుఁ
బలుకుచుందురు; మహీభారంబడంప
నల్లబ్రహ్మ ప్రార్థించినందుచే నీవు
జనియించినావని సకలసజ్జనులు
కొనియాడుదురు నిన్ను కుంభినీరమణ!
ఓతండ్రి! కృష్ణ! నీవున్నదినంబు
లాతతంబుగను మాకరణ్యములకై
వడిజరిగె, నిక్కడమమ్ముడించి
యావరపురికి నీవరిగితివేని
యీకాలమందు నిన్నెడబాసియున్న
మాకుదినంబులు మన్వంతరముల
కరణిగా జరుగు నఖండస్వరూప!
నరమిత్ర! యింకమీఁదనీమానసమునఁ
బరఁగయాదవులందు పాండవులందు
చిరమైనమోహంబు ఛేదించుమింకను,
యీన్నాళ్లు నాబిడ్డ లిడుములఁబడిరి
చెన్నొందనీవు రక్షించిధర్మజుని
శ్రీకరరాజ్యార్హు జేసియుంచితివి,
నాకింతియేచాలు నళినాయతాక్ష!
యీమీఁదవారి జోలేమినేనొల్ల
నీమీఁదిధ్యానంబు నిరతంబునెసఁగు
దినముననిన్ను చింతింపుచునుండి
ఘనవార్ధిలోఁజేరు గంగచందమున
నీపదద్వయమందు నేనుజేరెదను
నాపాలనుండవే, నాతండ్రి!"యనిన
నాకుంతిమాటల కౌఁగాకయనుచు
నాకంజలోచనుఁ డాదరింపుచును
నలలితలీల వైష్ణవమాయగప్పి
తొలఁగక మేనత్తతోనిట్టులనియె:
"ఓయత్త! నీవుమహోత్కంఠతోడఁ
బాయక నీసుతుల్ పరఁగఁబూజింపఁ,
గోడండ్రునినుభక్తి గొలువ వారలకుఁ
జోడిమిగానీవు బుద్ధిచెప్పుచును,
బలహీనతను దుఃఖపడెడుగాంధారి
యలుకవారింపుచు నాదరింపుచును,
యరయ నుత్తరగర్భమందున్నశిశువు
కురుకులోద్ధరణుఁడై కుతలంబునందు
జనియించువాని ముచ్చటలింకకొన్ని
దినములఁజూచి మోదింపుచునుండు;
మాపాండుభూపాలుఁ డరిగినమొదలు
పాపాత్ముఁడగు కురుపతిచేతఁజాల
నిడుములఁబడుచుంటి రింకమీఁదనైన
కొడుకులుకోడండ్రు గురుసౌఖ్యములను
వెలయఁగావారిని వీక్షించికొనుచుఁ
దలకొనినన్నాత్మఁ దలఁపుచునుండు"
మనిసుభద్రకు, ద్రుపదాత్మనందనకు,
మనమురంజిల్ల సమ్మతముగాఁజెప్పి
పనిబూనిరథమెక్కి పైనసహాహారిని
గనిధర్మరాజాతక్కక నిట్టులనియె:

—పాండవులనో్యన్యము సంభాషించుట—

"ఓకృష్ణ! నీవునాయొద్దనుండగను

నీకృపావృష్టిచే నేబంధుమరణ
శోకానలంబు నార్పుచునుంటి, నీవు
లేకున్న నేనార్పలేను. నాకొఱకు
నిలువవే"యనిన మన్నించియచ్చోట
నిలచికృష్ణుఁడు చాలనెనరు రెట్టింపఁ
దాను వేదవ్యాసు ధౌమ్యునిగూడి
నానావిధములైన న్యాయశాస్త్రముల
బోధించినను ధర్మపుత్రుఁడింతైన
మేధదానొందకిమ్మెయి వచియించె:
"అనఘాత్ములార! మహాకృపతోడ
ననుగూర్చిబోధించు న్యాయశాస్త్రములు
వరుసగా విన నావ్యథ దీరదందు
కొఱకుఁ దపంబుగై కొన్న మేలగును,
పట్టుగా నెందు కాపనియన్న వినుడీ;
రట్టడియైనేను రాజ్యంబుకొఱకుఁ
గట్టడినగుచు భీకరయుద్ధమంగుఁ
బట్టిజంపించితి బంధుజాలముల
గంగాతనూజుని, ఘనతపోనిధిని,
సంగరభీముని, సత్యవర్తనుని,
స్వచ్ఛమనస్కుని, సద్ధర్మపరుని,
స్వచ్ఛందమరణుని చావుమటంచు
మంచిమాటలఁజెప్పి మాతాత నతని
వంచించిధరణిపై వ్రాలఁజేసితిని;
యకట! ద్రోణాచార్యుఁడస్త్రగురుఁడు,
నకలంకుఁడతనితో ననృతంబుబలికి
చంపిఘోరాఘంబు సంగ్రహించితిని,
తెంపుతోఁగర్ణుండు తేరకాఁడనుచు
నగ్రజుఁడైన పద్మాప్తతనూజు
నాగ్రహంబున ద్రుంపుమనివచించితిని,
గాన నాయటువంటి కఠినచిత్తునకు
మానునే నరకమేమాడ్కి చూచినను.
లలిమీఱఁబ్రజల పాలనసేయురాజు
బలముచేరిపులను ఖండనమందుఁ
బొరిగొన్న పాపంబు పొందఁడటంచు
నరయశాస్త్రముబల్కు, నాశాస్త్రసరణి
ఇరవైన విజ్ఞానహేతువుగాదు;
పరఁగఁబంకముచేతఁ బంకిలస్థలము
పరిశుద్ధిఁబొందని పగిదిఁగర్మములు
పురుషునిపరిశుద్ధిఁ బొందింపఁగలవె?
మెరువడిగా నశ్వమేధాదులయిన
యాగముల్ గృహమేధియైన పూరుషుఁడు
బాగొప్పజేసిన బ్రహ్మహత్యాది
పాపముల్ చెడునంచుఁబల్కు వేదంబు,
లాపుణ్యఫలమున కాసించిజనుఁడు
వలనొప్ప బుద్ధిపూర్వకజీవహింస
తలకొనిచేసిన దానిచే నఘము
విపులమౌగాకది విడుచునేయనుచు
నిపుణుశంకించెద, నెబ్భంగినైన
నావంటిచపలుని నారాయణుండు
వావిరికడతేర్పవలె నంతెగాని
యన్యసత్క్రియలచే నఘములఁబాసి
మాన్యుండనగుదునే మహిమీఁదనేను?
అటుగాన మనభీము నభిషిక్తుఁజేసి
పటుతీవ్రగతి నాదుపట్టంబుగట్టి
శ్రీవిష్ణుదేవుని చిత్తమందుంచి
సేవనంబునకేఁగ నిర్మలత్వంబు
గల్గునా"కని పల్కఁగాభీముఁడతని
తలఁపుభావించి యుద్ధతనిట్లులనియె:
"అన్న! నీకింతయారటమదియేల?
మున్నుకౌరవులెల్ల మూఢాత్ములగుచు
మనలకు వేధ లేమరకజేసినది
జనులందరెఱుఁగరా జగతీతలమున?

నీకేమి తెలియదే? నీవింతగాను
శోకింపనేల? నాపుత్రులకొఱకు
గాంగేయకుంభజకర్ణులు సమర
రంగంబులో మహాశాస్త్రంబుజూపి
భూరిసాహసమున ఘోరాడిపడిరి;
వారూరకుండఁగా వారినిబట్టి
చంపినదోషమెంచఁగ వచ్చుగాని
తెంపుతోమనలను తెగటార్చుకొఱకు
వీరులై పోరగా వెనుకకురాక
వారిజంపినయేల వచ్చుపాపంబు?
'సంశయాత్మావినశ్యతి' యంచువిగత
సంశయాత్ములు బల్కుచందంబునీవు
వినియును సంశయాన్వితుఁడవై యిపుడు
ఘనతరవైరాగ్యకలితుండవగుచు
నాకుఁబట్టముగట్టుదా, యింకమీఁద?
నీకన్నముందర నేవిరక్తుఁడను
కావుననీవెంట కాననంబునకు
నేవత్తునీమాట నిక్కంబుగనుక
పట్టంబుగట్టు నప్పార్థున"కనుచు
గట్టిగాఁబల్కఁగా కవ్వడినవ్వి
దనుజారి, వ్యాసుండు, ధౌమ్యుండుచూడ
ననిలనందనుజూచి యపుడిట్లులనియె:
"మంచిమాటాడితి, మారుతపుత్ర!
మించివిరక్తి నిమ్మెయి నన్ను, నీవు
వనవాసములయందు వర్తింపవలయు
జనులతో నేను రాజ్యముసేయవలయు
ననునాశచేఁగాదె హరితోడ శత్రు
జనులసంగరమందు జంపినదెల్ల?
నాకోర్కె దెలిసియున్నావందుచేత
నాకుఁబట్టముగట్టి నన్నిందునిలిపి
పోదమంటివి. నాకు పొందెసౌఖ్యంబు?
వాదులింకేల? నేవత్తుమీవెంట,
నాకురాజ్యంబేల? నకులునిబిల్చి
ప్రాకటమతి మీరుపట్టంబుగట్టి
హరినింక ద్వారకకనిపి మువ్వురము
నరగఁగావలయు ఘోరాటవి" కనిన
నకులుఁడర్జునుజూచి నగి హస్తయుగము
ముకుళించిపలికె నమ్మురవైరివినఁగ:
"అన్నలమువ్వుర నడవికిఁబనిచి
పన్నుగా నేనిందు పట్టభద్రుఁడను
గావలెనని మున్ను కమలసంభవుని
సేవించి తపమెంత చేసియుండితినో
గనుక నాకింత భాగ్యములభించినది.
ఇనతేజులార! యింకీమాటలేల?
సహదేవు నిచట రాజ్యంబునందుంచి
రహిమీఱఁగా నలురము వనంబునకుఁ
బోద"మటన్న నపుడు సహదేవుఁ
డాదీనమందారుఁడగు హరిఁజూచి:
"వీరివాక్యంబులు వింటివే? కృష్ణ!
వైరాగ్యమెఱుఁగనివాడ నేనగుచు
నలుగురన్నల నరణ్యమునకుఁబనిచి
బలముగా నేరాజ్యభారమంతయును
నెలవుగానిచ్చట నెత్తిఁబెట్టుకొని
వలనొప్ప పాలింపవలెనట నేను.
నాకేల రాజ్యంబు? నాకేల జనులు?
నాకేల నాయరణ్యంబులజోలి?
మురువొప్ప నీపాదములనాశ్రయించి
చిరభక్తితో సేవజేయుచుండెదను,
నీరజోదర! నాకు నీసేవచేత
వైరాగ్యమున ఘోరవనమందుఁదపము
గావించువారికిఁ గల్గుఫలంబ
భావింప నాకు లభ్యంబగుగాక!"

యనియిట్లు పతులంద ఱాడుచున్నట్టి
ఘనతరవైరాగ్యకలితవాక్యములు
విని ద్రౌపదీదేవి వెఱచి మాధవుని
గనియిట్టులనియె గద్గదకంఠయగుచు:
"అన్న! శ్రీకృష్ణ! నీవతికృపచేత
నిన్నిచందంబుల నీపాండుసుతులఁ
బట్టభద్రులఁజేసి పాలించుకతన
పట్టుగా నీపాదపద్మంబులందు
భారంబునుంచి భూభారమేలినను
వీరికఘంబు లేవిధమునవచ్చు?
వీరిపు డీరాజ్య విభవంబువిడిచి
యారణ్యవాసులై నప్పటికైన
తముగాంచి పెంచిన తల్లి యుండఁగను
తమకుసంసారంబు తప్పునేయుచట?
నాయమ్మ తమతోడ నడవికేఁబోక
నీయెడనిల్చునే యింకమీఁదటను?
ఆయత్త కుపచారమైనజేయుటకుఁ
బాయక నేను, సుభద్ర బోవలయు;
మావెంట నాయభిమన్యునిభార్య
తావచ్చు, నచట నందరముగూడినను
అచ్చట సంసార మధికమౌగాని
విచ్చిపోనేర దేవిధముఁజూచినను;
కడకతో బాహ్యసంగము వీడిచనిన
తడబడుచుండు నాంతరసంగమచట,
కావున వీరింక గహనంబుఁజేరఁ
బోవలసినదేమి? పుండరీకాక్ష!"
యనుచు ద్రౌపదిపల్క నంతలోకుంతి
దనుజారి నీక్షించి తానిట్టులనియె:
"దేవదేవ! మహాత్మ! దేవకీపుత్ర!
భావనాతీత! శ్రీపద్మాసమేత!
క్రమముగా దుష్టనిగ్రహముగావించి
ప్రమదంబు దీపింపఁ బనిబూనితమకు
నీవుపట్టముగట్టి నిల్పినచోట
వావిరినుండఁగావలె నంతెగాని
తామరణ్యముల కీతరివిరాగమున
నీమాడ్కిఁబోవుట కేమికారణము?
అంతటికిని కర్తవైన యీశ్వరుఁడ
వింతగా రక్షించి యీరాజ్యపదము
దయచేసినపుడ చింతవహించి పాప
భయముతో నడవుల పాలుగానేల?"
ననిపల్క మేనత్త నాదరింపుచును
దనుజారి వ్యాసుని, ధౌమ్యునిజూచి
"వింటెరిగదమీరు వీరివాక్యములు!
గెంటక దీనికేక్రియజేత?" మనిన
వారిట్టులనిరి యవ్వనజాక్షుఁజూచి:
"శ్రీరుక్మిణీశ! నీచిరచిత్తమునకుఁ
దెలియనియర్థమెద్దియు లేదుమాకుఁ
దెలిసినయంతలోఁ దెల్పెదమొకటి;
యదియెట్టులనిన: మహానుభావుండు
సదయుండు భీష్ముండు శరతల్పమందు
నొనరంగఁబవళించి యుత్తరాయణము
చనుదెంచునంతకు జన్మంబునిచట
విడువరాదనుచు జీవింపుచున్నాఁడు;
తడయకచ్చోటికి ధర్మనందనుని
పిలుచుకపోవఁగా భీష్ముఁడీతనికిఁ
దెలియధర్మముల బోధించు"నటంచుఁ
బలుకగా కృష్ణుఁ డీవనిమేలటంచుఁ
దలఁచుచు ధర్మనందనుని వీక్షించి
యటపోయివ తమింకనిన ధర్మజుఁడు
"కటకటా! శ్రీకృష్ణ! కరుణాసమేత!
యానిర్మలాత్ముఁడైనట్టి భీష్ముండు
మానిమిత్తంబున మహియందు వ్రాలి

# అవంతిసుందరి

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

వైదికయుగమున వన్నెఁగాంచియుండిన స్త్రీవిద్యాభివృద్ధి యేకారణముననో లౌకిక వాఙ్మయయుగము తొలిదినములలో సన్నగిల్లిపోయినది. క్రీస్తుశకమున మొదటినుండి కొన్ని శతాబ్దములవఱకు వాఙ్మయవిషయమున వనితలకంతటి పట్టుదలకాని, ప్రోత్సాహముకాని యున్నట్లు కన్పింపదు: అట్లని స్త్రీవిద్యనశించినదని చెప్పవలనుపడదు. విక్రమార్కుని నవరత్నములలో నొకండనిపేరుగన్న వరాహమిహిరవిద్వాంసునిసుదతి విదుషీమణియని యందఱునెఱింగిన విషయమే. కాళిదాసుని శాకుంతలనాటకమునఁగల శకుంతలారచిత ప్రణయలేఖంబట్టి యక్కాలపుకాంతలు కవయిత్రులనిచెప్పనొప్పును. ధారానగరాధిపుఁడగు భోజునికాలమునఁ గవిత్వమునెఱుంగనివాఁ గాతని యూరనేలేరని చెప్పు భోజచరిత్రపుటితిహాసములు సర్వజనవిదితములు. అది చాలవఱకతిశయభూయిష్ఠమైనను, అందలి పండిత కుటుంబపు కథమాత్రము యుక్తమై స్త్రీవిద్యావ్యాప్తిసూచకమై యలరారుచున్నది. క్రీ. శ. 11-వ శతాబ్దపువాఁడగు భోజునికాలముననిట్లు విద్యావ్యాప్తియున్నను, అతనికిఁ బూర్వమున నంతటి వ్యాప్తియున్నట్లు నిశ్చయింపనవకాశములేదు.

శూద్రకమహాకవి రచించిన మృచ్ఛకటికము తక్కిన నాటకములన్నింటికంటెను దేశ చరిత్రను దెలిసికొనుటకు మిక్కిలియుపయోగించుచున్నది. కవియెవ్వఁడైనను ఈనాటకము మాత్రము భాసకాళిదాసులకు నడుమనున్నకాలమున రచియింపఁబడినదని యైతిహాసిక సిద్ధాంతమొకటికలదు. నాటకపు (సామాన్యముగ నాటకమని వ్రాయుచున్నాము. మృచ్ఛకటికము ప్రకరణమని యాలంకారికుల సిద్ధాంతము) శైలి-ప్రాకృతభూయస్త్వము-అయ్యది ప్రాచీనమైనట్లు తెలుపఁగలవు. అందు మైత్రేయుని

> మమతావద్ద్వాభ్యామేవహాస్యంజాయతే
>
> స్త్రియాసంస్కృతంపఠన్త్యా మనుష్యేణచకాకలీంగాయతా।"

అను వచనమునుబట్టి యాకాలమున స్త్రీవిద్యాప్రచారము చాలవఱకు సన్నగిల్లిపోయినట్లు తెలియఁగలదు. కాని యందులకు హేతువుమృగ్యము.

క్రీ. శ. 880—920ల నడుమనుండిన రాజశేఖరునికాలమున స్త్రీవిద్యావ్యాప్తి యెక్కువగనున్నట్లాతని కావ్యమీమాంసవలనఁ దెలిసికొనవచ్చును.

"పురుషవత్ యోషితోఽపి కవీభవేయుః। సంస్కారోహ్యాత్మని సమవైతి, న స్త్రైణం పౌరుషంవా విభాగమపేక్షతే। శ్రూయన్తేదృశ్యన్తేచ రాజపుత్ర్యో మహామాత్రదుహితరోగణికాః కౌతుకిభార్యాశ్చ శాస్త్రప్రద త్తబుద్ధయఃకవయశ్చ।" [కావ్యమీమాంస పేజి 53] •

---

• శ్రీయుత పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు దీనిని తెనుగున వెలయించి ఆంధ్రులకృతజ్ఞతకు పాత్రులైనారు.
—సంపాదకుడు.

[అభిప్రాయము-పురుషులవలెనే స్త్రీలుకూడ కవనము చెప్పవచ్చును. హృదయమున మర్త్వన్నమగు సామర్థ్యమునకు స్త్రీపురుష (లింగ) భేదములేదు. రాజపుత్రికలును, మంత్రిపుత్రికలును, న్యాయవాదుల భార్యలు, వేశ్యలు-విదుషీమణులును, కవయిత్రులునగుట మనమువినుచున్నాము. కనుచున్నాముకూడను-]

దీనింబట్టిరాజశేఖరునికి స్త్రీవిద్యావిషయమై యెక్కువగ ఆదరమున్నట్లును, ప్రోత్సాహోత్సాహమున్నట్లును విశదమగుచున్నది. అతఁడట్టి యుదారాభిప్రాయములను గల్గియుండఁబట్టి యతని యర్ధాంగియగు నవంతిసుందరి మహావిదుషీమణియై కీర్తినొందెను.

అవంతిసుందరీదేవి కవిశేఖరుని యర్ధాంగలక్ష్మి. ప్రసిద్ధక్షత్రియవంశమగు చోహాన వంశమున నుదయించిన విదుషీమణి. ఈమెకు సాహిత్యమునందును, సాహిత్యశాస్త్రము నందును మంచిపాండిత్యమును, ఆసక్తియునున్నటులఁ దెలియుచున్నది. ఈమెకోరికయే భర్తయగు రాజశేఖరునిచేఁ గర్పూరమంజరీసట్టకమును రచియింపించెను. ఈవిషయ మాదృశ్యప్రస్తావననుబట్టి మనము తెలిసికొనుచున్నాము.

రాజశేఖరుఁడు తారచించిన కావ్యమీమాంసయందచ్చటచ్చటఁ దక్కిన యాలంకారికుల మతములతోఁబాటుగ నవంతిసుందరియొక్క మతమునుగూడ వెల్లడించియున్నాఁడు. చూడుఁడు—

"విదగ్ధభణితిభంగి నివేద్యం వస్తునోరూపం ననియత స్వభావమ్| ఇతి అవంతిసుందరీ|"

[కావ్యమీమాంస పేజి 46]

"అయుతు ప్రసిద్ధః| ప్రసిద్ధిమానహం......................ఇత్యేవమాదిభిఃకారణైః శబ్దహరణేఽర్థహరణేచాభిరమేత| ఇతి అవన్తిసుందరీ|"

[కావ్యమీమాంస పేజి 57]

"ఇయమశక్తిర్న పునఃపాకః| ఇత్యవన్తిసుందరీ|"

[కావ్యమీమాంస పేజి 20]

రాజశేఖరుని కాలమునఁ బ్రాకృతభాషయందు మంచియాదరము చూపఁబడినట్లును, రాజశేఖరునికి దానియందెక్కువ మక్కువగలట్లు నతని నాటకములంబట్టి తెలియుచున్నది. అవంతిసుందరికిఁగూడ నాయభిప్రాయమే గలదని యామె ప్రేరణచే వ్రాయఁబడిన కర్పూర మంజరి చెప్పకచెప్పుచున్నది. ఇట్టియెడఁ బ్రాకృతమునసేగాక కఠినతరమగు సంస్కృతమున నాదరముచూపుటయేగాక, అందాలంకారికపదవి నలంకరించిన యవంతిసుందరి మిగులఁ గొనియాడఁదగినది.

"రాజశేఖరుఁడు తనకుభార్యయందుఁగలమక్కువచేత నామె విదుషీమణి కాకపోయినను ఆమెనుఁగీర్తి నాపాదింపఁజేయు నుద్దేశముతో నామెమతములని పేరుపెట్టి యిట్లు వ్రాయఁగూడదా?" అనుసందేహము కలిగినకలుగవచ్చును. కాని క్రిందఁ బ్రతిపాదింపఁబోవు నంశమునుబట్టి అవంతిసుందరిమతము వేఱనియు, రాజశేఖరునిమతము వేఱనియుఁ దెలియఁ

గలదు. ఒకవేళ నవంతిసుందరి విద్వాంసురాలు కాకున్నను రాజశేఖరుఁడేయట్లు చెప్పినచో మతవైషమ్యము కలుగ నణుమాత్రావకాశమును కలుగదుకదా? దీనినిబట్టియే యామెకుఁ గల పాండితీప్రకర్షము విశదముకాఁగలదు. మగనియెడనామె కెంతటిచనవు—స్వాతంత్ర్యము ఉన్నను, పాండిత్యవిషయమునఁ బ్రతిద్వంద్వినియగుట కామెకుచితపాండితియుండకతప్పదు గదా! ఈక్రిందఁబఠికింపుఁడు...

"యథాతథావాస్తువస్తునోరూపం। వక్తృప్రకృతి విశేషాయత్తాదు రసవత్తా। తథాచయమర్థం రక్తః స్తౌతితంవిరక్తో వినిందతిమధ్యస్థస్తు తత్రోదాస్తే" ఇతిపాల్యకీర్తిః।.................."విదగ్ధభణితి భంగినివేద్యం వస్తునోరూపంననియత స్వభావమ్" ఇతి అవంతిసుందరి-యదాహ—

వస్తుస్వభావోఽత్ర కవేరతన్త్రం
గుణాగుణావుక్తి వశేనకావ్యే॥
స్తువన్నిబధ్నాత్యమృతాంశుమిందుం
నిందంస్తుదోషాకరమాహధూర్తః॥"

"ఉభయముపపన్న" మితియాయావరీయః (రాజశేఖరః)" ♦

[కావ్యమీమాంస పేజి 46]

ఈమీఁది యంశమునుబట్టి యువంతిసుందరి తనయభిప్రాయము నిచ్చుటయేగాక రొుక యలంకారగ్రంథమును వ్రాసినదనికూడ మీఁదిశ్లోకము చెప్పుచున్నది. కావ్యమీమాంసకుఁ బ్రస్తావనను రచియించిన సి. డి. దాలాల్ (C. D. Dalal, M.A.,) మహాశయులు కూడ నీయభిప్రాయమునే గల్గియున్న ట్లీక్రిందిపంక్తులు చెప్పఁగలవు.

" Rajasekhara quotes thrice in the Kavyamimamsa, the opinion of his wife Avantisundari. It would thus appear that she had composed some work on rhetorics."

[See Introduction, Page xiii)

మహిళామణులలో గ్రంథములు వ్రాసినవారు ప్రాచీనకాలమునఁ దక్కువ. అందుశాస్త్రగ్రంథములు రచియించినవారు లేరనియే చెప్పవచ్చును. అట్టిచో నలంకార శాస్త్రమున మిక్కిలి కృషిసల్పి యఖండపాండిత్యమును సంపాదించి స్వతంత్రముగ గ్రంథమును వ్రాసిన యవంతిసుందరి నామము స్వర్ణాక్షరములచే వాఙ్మయాభిమానుల హృదయ ఫలకమున లిఖింపఁబడియుండుటలో నేమియు నాశ్చర్యములేదు. ఇట్టి గౌరవముపొందుట కీమెయేమొదటి మహిళామణి. కాని యామె రచించిన యాగ్రంథమును నేఁటికిని బొందు భాగ్యము భారతీయులకు లభింపనందులకు మిగుల విచారము. అదియే లభించినచో నామె కీర్తి యింకను వెల్లువిరిసి జయభేరిమ్రోగించుననుటకు సందియములేదు!

అవంతిసుందరీదేవి మహిళాలోకమున మశిపూసరైు మహిళాలోకము కీర్తిని జిరస్థాయినిగాఁజేసినందులకు మహిళాలోక మామెయెడ విశేషగౌరవమును జూపవలసినకార్యము

♦ రాజశేఖరుఁడు తన గ్రంథమునఁదన్ను యాయావరీయుఁడనియే చెప్పుకొనెను. బు.వేం.ర.

విధియైయున్నది. అంతియగాక ఆమెవలెనే తామును దమకీర్తి నుద్ధరింప నుచితపాండిత్యమును సంపాదించి గ్రంథరచనకుఁగడంగి వాఙ్మయము నుద్ధరించుటయు విధియే.

విస్మృతవాఙ్మయమునందలి యమూల్యగ్రంథములు నవంతిసుందరి రచించిన యలంకారగ్రంథమును పరిశోధనలుసల్పి బయటఁబెట్టగల బాధ్యత వాఙ్మయపరిశోధకులదై యున్నది. ఆకార్యమును విదుషీమణులేమొనర్చ రేని యింకఁ గావలసినదేమున్నది?

## సత్యము

శ్రీమతి గిడుగు సత్యవతీగారు

సత్యమును దప్పరాదెట్టి సమయమైన
సత్యముననె ధర్మంబులు సర్వముండు
సత్యనిరతులకెందును జయమెకల్గు
సత్యహీనుల కిలలేదు సంతసంబు.
అనృతములాడువా రెంతయధికులైన
జనులమెప్పును బొందగాజాలరిలను
వారినమ్మరు కడజాతివారలైన
సత్యనిరతులేయధికులు సత్యమిదియ.
కల్లలాడువారి గౌరవమిలజెడు
దండనంబుచేయు దైవమదివి
యిందునందుసుఖము నిడదుయసత్యంబు
సూనృతంబెయొసగు సుఖమునెందు.

గాధితనయునిచే గడుగాసిజెంది
సర్వధనమునుగోల్పడి సతిసుతులను
గూడనెడబాసి సత్యంబుకొరకు నియతి
దాల్చెగాదె హరిశ్చంద్రధరణివిభుఁడు.
పంక్తిరథభూవిభుడు తనపడతికైక
కిడినవరముల లేదని నుడువలేక
కన్నసుతుడు శ్రీరాముండు కానకేగ
విడచెబ్రాణముల్ సత్యంబువిడువలేక.
జనకుసత్యంబు జెల్లింప జనకజయును
దమ్ముడును దోడరా కాననమ్ములందు
యిడుములనుబడె బదునాలుగేండ్లురాము
డెంతమహిమయో సత్యానికెఱుగదరమె?

## మౌనము

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

సతతమునీతోడ సద్గోష్ఠి సల్పునేను
అలసివచ్చినహృదయేశు నరయబోవ
వ్యాజమినుమంతయైనను వ్యక్తపరుప
కుండ మౌనముద్రవహించి యుంటివేల?
ముద్దుచిలుక! యింతటినేరమునక యీను?
పక్షి! ప్రాణసఖునివలె బ్రాణనాథుఁ
డింతకాలంబు నిన్ను నాడించుచుండఁ
బలుకకుండుట నీకిప్డు భావ్యమౌనె?
పరుల మన్నించువృత్తియె పౌరుషంబు.

శైశవంబాదిగ శుకమ! చనవుతోడఁ
జిన్నిబిడ్డనుగాంచి పెంచినవిధాన
శిథిలపక్షమాత్రంబవై చెట్టుక్రిందఁ
బడిననీపాటుజూచి దెప్పరిలఁజేసి
పెంపనియమించినదినిన్ను ప్రియుఁడుగాదె?
'ఆత్మవత్సర్వభూతాని' యనెడిపలుకు
నాకునుపదేశమొసరించినాడు విభుఁడు
అదియెవేదవాక్యముగను మదికిఁదోఁప
నిన్నుబెంచితినాత్మకు నీమమెంచి.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

చిట్టిచిట్టి—
ఏమిచిట్టి?
లక్కచిట్టి—
ఏమిలక్క?
పచ్చలక్క—
ఏమిపచ్చ?
ఆకుపచ్చ—
ఏమిఆకు?
ప్రత్తియాకు—
ఏమిప్రత్తి?
రంగుప్రత్తి—
ఏమిరంగు?
తోపురంగు—
ఏమితోపు?
అరటితోపు—
ఏమిఅరటి?
బొంతఅరటి—

ఏమిబొంత?
గుడ్డబొంత—
ఏమిగుడ్డ?
మొద్దుగుడ్డ—
ఏమిమొద్దు?
తుమ్మమొద్దు—
ఏమితుమ్మ?
దగ్గుతుమ్మ—
ఏమిదగ్గు?
పొడిదగ్గు—
ఏమిపొడి?
బొగ్గుపొడి—
ఏమిబొగ్గు?
మసిబొగ్గు—
ఏమిమసి?
పొయ్యిమసి—

ఏమిపొయ్యి?
మట్టిపొయ్యి—
ఏమిమట్టి?
పుట్టమట్టి—
ఏమిపుట్ట?
పాముపుట్ట—
ఏమిపాము?
త్రాచుపాము—
ఏమిత్రాచు?
కోడెత్రాచు—
ఏమికోడె?
పెద్దకోడె—
ఏమిపెద్ద?
ఊరిపెద్ద—
ఏమిఊరు?
అమృతలూరు—

౨. పాటలు

## మరదిపాట

శ్రీమతి అమూరి వేంకటరామారావుగారు

ముక్కునముక్కట ముందరిజుట్టట
నత్తినోరట నల్లనివాడట
గొగ్గిపళ్లట కోరమీసమట
బావమరదుల బంతికిరాడట
పంచనుగూర్చొని మూకుముంతల
గంజిత్రాగెడువాడట,
విరుగమోసితి యేడెడ్లబరువు
ఎట్లాయిస్తిని యితనికిచెల్లెలిని?

మంచిగంధము పుయ్యకుయితడు
మల్లెపువ్వులు చుట్టకుయితడు
పోకచెక్కలు వెయ్యడుయితడు
తామలపాకులు నమలకుయితడు
చింతగింజవకటి దవడను వేసుకు
మఱ్ఱాకువకటి నోటిలో వేసుకు
పరుపుమీద పవళించకుయితడు
తలగడ,దిళ్లు తన్నుకాళ్లను
ఈతచాప నాకిష్టములెమ్మను
కొయ్యపీట తలక్రింద పెట్టుకు
గోనెగుడ్డవకటి దుప్పటికప్పుకు
గుఱ్ఱుపట్టి తా నిద్రపోతే
హేళనచేసిరి అత్తవారెల్ల.
చెప్పకుండ తా లేచిపోయెను
ఎట్లాయి స్త్రీని యితనికిచెల్లిలిని?

## నాపేరు జమీందారు

తాతనాకు దమ్మిడీయిచ్చె
దమ్మిడితీసికెళ్లి కోమటికిస్తె
కోమటినాకు కొబ్బరిపెట్టె
కొబ్బరితీసికెళ్లి గుఱ్ఱానికిస్తె
గుఱ్ఱమునాకు సలాముపెట్టె
సలాముతీసికెళ్లి పంతులుకిస్తె
పంతులునాకు పద్యముచెప్పె
పద్యముతీసికెళ్లి మామకిస్తె
మామనాకు పిల్లనిచ్చె
పిల్లపేరుమల్లిమొగ్గ
నాపేరుజమీందారు.

## వదిన పాట

పత్తిప త్తిఆకూలు
పన్నేరుదండాలు
మంగళగిరికోకాలు
రంగైనరవికెలు
మా అన్న దెచ్చేను.
మావదినకట్టింది.
ఒళ్లుయిట్ల తిప్పింది.
చీమలఅట్టకట్టింది.
నేనూఅట్టెచూశాను.

## పంపరే మాయింటికి పెద్దకోడల్ని

తాడిచెట్టుక్రింద చెప్పులావిడా!
తాడమ్మ మీయింటికొచ్చినాము
మునుపేముగ్గుర్ని యిచ్చియున్నాము
వెనుకేనలుగుర్ని యిచ్చియున్నాము
దోచుకుపోయేటందుకు దొంగల్లాల
పారిపోయేటందుకు పడగాలింగమా
ఎత్తిన్నకొడుకుల్లు యేకశంఖుల్లు
పత్తిన్నకొడుకుల్లు భమిడుంగరాలు
పంపరే మాయింటికి పెద్దకోడల్ని.

3. బుద్ధిపరీక్ష

## యుక్తిలెక్కలు

[ఈ యుక్తిలెక్కలకు సమాధానము స్వతంత్రముగ నాలోచించి 12 సంవత్సరములకు లోబడినబాల బాలికలు ఏప్రియలు 10-వ తేదీలోపున లేఖాముఖమున-వారివయసుతో సహా-మాకు తెలుపవలెను.]

౨

శ్రీమతి బి. మాణిక్యాంబగారు

ఒకతల్లి ఇంటికి ముగ్గురుకూతుండ్రువచ్చిరి. వారు వత్తురనే సంతోషముతో వారి కొఱకు తల్లికొన్ని ఫేణీలనుచేసి వాటిని మూడుపళ్లెరములయందు సమానముగా ఉంచెను. మొదటి అమెవచ్చి. ఒకతట్టలోని ఫేణీలను భుజించి మిగిలిన రెండుతట్టలలోని ఫేణీలను మూడుతట్టలయందు సమముగాఉంచి వెళ్లెను. అనంతరం రెండవఆమెయు పైరీతిగనేజేసి పోయెను. తరువాత మూడవకూతురుకూడా అట్లేచేసిపోయెను. తదుపరి ముగ్గురుకూతుండ్రు కలసివచ్చి మూడుతట్టలయందు సమముగా ఉండిన ఫేణీలను చెరియొకపళ్లెరము తీసికొని భుజించిరి. మొదట తల్లిపెట్టినఫేణీలు ఎన్ని? ఒక్కొక్కరు తినినవి ఎన్ని?

౮. పిట్టకథలు

## కోతి: మద్దెల

కల్లూరు అహోబలరావుగారు

అనగా అనగా నొకయూరు. ఆయూరిదగ్గఱ నొకతోట. ఆతోటలో నొకకోతి. ఒకనాఁడాకోతి యొకకొమ్మనుండి మరియొకకొమ్మకెగురుచు జాతిముండ్లకంపలలోఁబడెను. ఒకముల్లు తోఁకకు బలముగా గ్రుచ్చుకొనెను. పాపము! నొప్పిచే అఱచుచు మంగలివానిదగ్గఱకు పరుగెత్తి ముల్లుఁ దీసివేయవలయునని కోరెను. మంగలవానిదగ్గర సూదియుండునా? ఉండదుకదా! ఉన్నకత్తినిఁదీసి కోతితోఁకనుపట్టుకొని ముల్లు దీయుచుండగా కత్తిదెబ్బతగిలి తోఁక 'కటుక్కు'నఁదెగెను. 'కుయ్యో' యని యాకోతి మొత్తుకొనగా మంగలవాఁడాతోఁక గాయమునకు మందువేసి బట్టతో బాగుగా కట్టిపెట్టెను.

అంత నాకోతి యూరుకొనక "మంగలీ! నాతోఁకను త్రుంచినావు. మందుకట్టినమాత్రమున తోఁక రాదుకదా! ఇప్పుడేమందువు? నాతోఁక సరిచేసెదవా? లేక నీకత్తినిచ్చెదవా?" యని యడుగగా మంగలి చేయునదిలేక తన కత్తి నాకోతికిచ్చి దానిబాధఁ దప్పించుకొనెను.

కోతి యాకత్తిని తీసుకొని వీధిలోఁపోవుచుండెను. ఒకయింటినుండొకమనుష్యుఁడుకట్టెపుల్లలకొఱకై చాలా బాధపడుచు యొకమొద్దునుండి కొన్నిపుల్లల నతికష్టమునఁ దీయుచుండెను. కోతి యతనినిచూచి "అయ్యో, ఇంత శ్రమయేల? నాకత్తితో నొక్కపెట్టువేసిన కట్టెలు ఫెళ ఫెళ విఱుగగలవు"అని చెప్పగా అతఁడాకత్తి నందుకొని యొక్కపెట్టువేయగా కత్తి 'పుటుక్కు'న విఱిగెను. కోతి దానినిచూచి "కత్తి నిచ్చెదవా? కట్టెనిచ్చెదవా?" యని యడుగగా యతఁడు కట్టెనిచ్చెను.

ఆకట్టెను తీసుకొని యాకోతి యట్లే యంగడివీధిగుండా పోవుచుండెను. ఒక అవ్వ దోసెలుపోయుచుండెను. కట్టెలయిపోగా ఆయవ్వ యెండుటాకులఁబెట్టి కష్టపడుచుండెను. కోతి యాయవ్వనుచూచి "అవ్వా! కష్టపడుటేల? ఈ కట్టెతీసికొనుము" అని కట్టె ఇవ్వగా ముసలవ్వ సంతోషపడి దోసెలు పోయుచుండెను. కట్టెయంతయు కాలిపోవువఱకు కోతి కనిపెట్టుచునేయుండి తరువాత అవ్వతో "అవ్వా! నాకట్టె నిచ్చెదవా? దోసెలిచ్చెదవా"? యని యడిగెను. ముసలవ్వ దోసెలిచ్చెను. ఆదోసెలు తీసుకొని కోతి తోట మార్గముగాఁ బోవుచుండెను. ఎండతీవ్రముగానుండెను. ఒక తోటగుండా కోతిపోవుచుండెను. అచ్చట నొక బాపఁడు మజ్జిగదుత్త నెత్తిత్రాగుచుండగా అతనినిఁజూచి "తాపము. తాపము. ఇదిగో మంచిదోసెలు.

తిని, మజ్జిగ త్రాగుము. పాపము! ఎండవడ యెక్కువ" అని దోసెలిచ్చెను. బ్రాహ్మణుఁడు సంతోషముతో దోసెలుతిని మజ్జిగఁద్రావి 'ఏవ్' అని త్రేచెను. అప్పుడు కోతి "బాపఁడా! నాదోసెలిచ్చెదవా? మజ్జిగ దుత్త నిచ్చెదవా" యనఁ యాబాపనయ్య కోతి సహవాసమని తెలిచి మజ్జిగదుత్త నిచ్చెను. ఆదుత్త తీసుకొని కోతిపోవుచుండెను. మఱియొకతోటలో ఒకతోటవాఁడొకకాలువనీళ్లను దోసిలితో పైకాలువకుఁ జిమ్ముచుండెను. కోతివానిఁజూచి, "తోటవాఁడా! ఏలశ్రమ! నాదుత్తతో నీరెత్తిచల్లుము" అనిదుత్తయిచ్చెను. తోటవాఁడు దుత్తతో నీరుచల్లుచుండగా అకస్మాత్తుగ రాతికిఁదగిలియాదుత్త ముక్కలయ్యెను. అప్పుడుకోతి "తోటవాఁడా! నాదుత్తనిచ్చెదవా? తోటనిచ్చెదవా?" యనియడిగెను. తోటవాఁడు తోటనిచ్చెను.

ఆతోటలో అనేకఫలవృక్షములుండెను. మామిడిపండ్లు, పనసపండ్లు, అరటిపండ్లు, జామపండ్లు, కిత్తిలిపండ్లు లెక్కలేకుండెను. మల్లెపువ్వులు, గులాబిపువ్వులు, గేదగిపువ్వులు, చేమంతిపువ్వులు కొల్లలుగానుండెను. ఇష్టానుసారముగ కావలసినన్నిపండ్లుఁదినుచు కోతి ఆతోటలోనే హాయిగానుండెను.

ఒకనాఁడు పొరుగూరియందు పెండ్లిజరుగునని కోతివినెను. ఆపెండ్లియింటికి కావలసినన్ని అరటిమొగ్గలు, కాయలు, ఆకులు, కిత్తలిపండ్లు, పనసపండ్లు, మామిడిపండ్లు అనేకపుష్పములు తీసుకొనిపోయి యిచ్చెను. పెండ్లింటివారు సంతోషించి పెండ్లికూతురును కోతికేయిచ్చి పెండ్లిచేసిరఁట.

పెండ్లికూతురుచక్కనికన్య. నాట్యమునందు నేర్పరి. పాటలుబాగుగాఁబాడఁగలదు. మద్దెలవాఁడు వాయించుచుండగా ఆపెండ్లికూతురుపాటఁబాడుచు లయతప్పక నాట్యమాడుచుండెను. అట్లు కుణిసికుణిసి యాపెండ్లిపడుచుకాలు తునకవిఱిగిపోయెను. కోతి భార్యనాట్యముఁజూచుముచ్చటనేయుండెను. వెంటనే ఆకోతి మద్దెలవానితో "నా పెండ్లాముకాలు సరిచేసెదవా? మద్దెలయిచ్చెదవా" యనియడుగగా మద్దెలవాఁడు కోతికిమద్దెలయిచ్చి సాగనంపెను.

కోతిమద్దెలతో ఒకతోటకుఁబోయెను. మామిడిచెట్టెక్కి యొకకొమ్మపైనెట్టునుగకూర్చొని యీక్రింది పాటఁబాడుచు మద్దెలను "డబ్ డబ్" అని వాయించుచుండెను.

తోకపోయె
దొరికె కత్తి 'డబ్ డబ్.'
కత్తిపోయె
కట్టెవచ్చెఁ 'డబ్ డబ్.'
కట్టెపోయె
కల్లెదోసె 'డబ్ డబ్.'
దోసెపోయె
దుత్తవచ్చె 'డబ్ డబ్.'
దుత్తపోయె
ధొరికెతోట 'డబ్ డబ్'

తోటలోన
దొరికెపండ్లు 'డబ్ డబ్.'
పండ్లుపోయె
పెండ్లిదొరికె 'డబ్ డబ్.'
పెండ్లిలోన
పిల్లదొరికె 'డబ్ డబ్.'
పిల్లకుణిసె
విఱిగెకాలు 'డబ్ డబ్.'
కాలుపోయె
డోలుదొరికె 'డబ్ డబ్.'

అనిపాడుచు వాయించుచుండెను. ఈపాటవినిపిల్లలు మూగిరి. గోలఁజేసిరి. తోటయజమానుఁడు కోతి తోటనునాశనము చేయుచుండుట తెలిసికొనెను. దానిని పాఱద్రోలుటకతఁడు కొందఱినివెంటబెట్టుకొని తోటకువచ్చెను. వారినాకోతిచూచి డోలుదబాలున క్రిందికివేసి చెట్టునుండిచెట్టునకెగురుచు పోయిపోయి

తనముందున్నతోటనుచేరుకొని సుఖముగానుండెను. ఆకోతిపాట వాయసారివారందఱు నేర్చుకొని యిప్పటి కిని పాడుచుందురట. కథకంచికిపోయెను—మనమింటికివచ్చితిమి.

## పెళ్లికుమార్తె

శ్రీమతి నల్లానిచక్రవర్తుల ఆండాళమ్మగారు

అనగా, అనగా ఒకరాజకుమారుడు అతనికినిజమైన, సరియైనరాజకుటుంబపు పిల్లనే గాని పెళ్లాడనని పట్టుదలవుండేది. అందుచేత ఎన్నిదేశాలోతిరిగేడు. ఎంతమందిరాజకుమార్తెలనో చూచేడు. కాని ఒక్కపిల్లఅయినా అతనికినచ్చిందిగాదు. తిరిగితిరిగి కొన్నాళ్లకు ఇంటికిజేరేడు ఒక్కడూ పెళ్లిజేసికోకుండానే. ముసలిదైన అతనితల్లి కొడుక్కి పెళ్లియీడు తప్పిపోతూందని, అతనితో వంశం అంతరిస్తుందని, పెళ్లిఇప్పట్లోకాకపోతే ఇకపట్టదే అని లోపలలోపల యేడుస్తూవుండేది. పాపం, ఇట్లావుంటూవుండగా ఒకనాడు అకస్మాత్తుగా పెద్దగాలివాన, ముసురుపట్టింది. బ్రహ్మాండమైనగాలికి చెట్లుచేమలు పెళపెళవిరిగికూలటం మొదలెట్టేయి. కడవపోతలాగ వర్షం ఆరంభించింది. ఆమహాసంక్షోభంలో ఎక్కడనుంచో వచ్చి ఒకపిల్ల రాజకుమారుడి ఇంటితలుపుతట్టింది. వెంటనేఅతనితల్లి తలుపుతీసి ఆవచ్చిన పిల్లనిలోపలికిరమ్మని వానలోతడిసిపోయిన బట్టలువదిలేసి పొడిబట్టలు కట్టుకోటానికిచ్చి, అమ్మా! నీవెవరనిఅడిగింది. ఆపిల్ల తల్లీ! నేనొకరాజకుమార్తెనన్నది. ఆమురికిగుడ్డలు ఆతడి బట్టలు వైఖరీచూస్తే రాజకుమార్తె అనేమాట నమ్మటానికి వీలుగాలేదు. కాని ఆమాట ఎంతవరకునిజమో కనుక్కోవాలని కనిపెట్టాలని అదుర్దాపుట్టింది రాజమాతకు. కట్టుకోటానికి ఇదివఱకే మంచిఅందమైన పొడిబట్టలిచ్చిందిగా. హాయిగా శుభ్రమైనభోజనం పెట్టింది. తర్వాత భోజనమైనతర్వాత ఒకగదిలో అందమైన మంచిమంచం వేయించింది. దానిమీద ఒకబటానీగింజపెట్టించింది. దానిపై సదూదిపరుపులు, పదిహంసతూలికాతల్పాలు వేయించి మంచిపీతాంబ్రముపై నపర్చించి ఆపిల్లనుదానిమీద పడుకో అమ్మా! అంది ముసలి తల్లి. ఆమెశెలవుప్రకారం అట్లాగేపడుకుంది ఆపిల్లఆతల్పంమీద. తెల్లవారింది. దేశమంతటితో పాటు రాజకన్యకకూడా మేల్గాంచింది. అప్పుడురాజమాత మెల్లగా ఆమెదగ్గిరకెళ్లి తల్లీ! రాత్రిహాయిగానిద్రపోయినావా అనిఅడిగింది. "అమ్మా! తెల్లవార్లు కంటికి కునుకన్నమాట లేదు. ఈపరుపులక్రింది ఏదోగుచ్చుకుంటూనేవుందిరాత్రంతాను. చూడు వళ్లంతా ఎట్లా కందిందో అదిగుచ్చుకుంటూవుంటంచేత" అనివళ్లుచూపించింది రాచకన్యక రాజమాతకు. ఆహా! ఇంతసుకుమారి తప్పకరాజకుమార్తే సందేహంలేదని కొడుకుకిచెప్పింది రాజమాత జరిగినకథంతాను. రాజకుమారుడు ఆకథంతావిని తానుకోరుకున్నరకం భార్యదొరికిందిగదా అని లోపలచాలాసంతోషించి ఆమెను మహావైభవంలో పెళ్లిచేసుకున్నాడు. కథకంచి కెళ్లింది.

# వెఱ్ఱిబ్రాహ్మడు

అనగా, అనగా ఒకవూరిలో ఒకబ్రాహ్మడు ఉండేవాడుట. అతను ఒకరోజున పొరపాటున తనభార్యఎంగిలితిన్నాడు. ఆపాపము కాశీకివెళ్లి గంగలోస్నానముచేస్తేకానిపోదనుకొన్నాడావెఱ్ఱిబ్రాహ్మడు. తక్షణం థూ, థూ, థూ అని ఉమ్మేస్తూ కాశీకిప్రయాణమయ్యాడు.

అల్లా కొంతదూరముపోయేటప్పటికి, పాపము, దాహమువేసింది. ఒకవూరువెళ్లి ఎవరినైనమంచినీళ్లు అడిగితే తిరిగిఎంగిలేప్రాప్తిస్తుందేమో అని ఒక ఇంటిదగ్గర పోకచెక్క ఇమ్మని అడిగేడు. ఆఇంటావిడ ఒకపోకచెక్క ఇచ్చింది. ఎంతో ఆప్యాయంగా ఆచెక్క నోటిలోవేసుకుని 'కట్టిక్క'ని కొరికేడు.

"అయ్యో! బ్రాహ్మడా! కొరికావటయ్యా పోకచెక్కని? దానిని ఎంతమందికో ఇచ్చేము. రెండునిమిషాలుచప్పరించి తిరిగిఇచ్చేవారు. ఎంతపనిచేసావయ్యా!" అన్నది ఆమె.

పెళ్ళాముఎంగిలితిన్నందుకే అఘోరిస్తుంటే ఇది ఏమిట్రా భగవంతుడా! అని ఆ పోకచెక్క ఉమ్మివేసి థూ, థూ, థూ అంటూ పరుగెత్తేడు బ్రాహ్మడు.

ఇంకోవూరువెళ్లేడు. ఒకముసలమ్మ ఇంటికివెళ్లి "అవ్వా! ఆకలివేస్తోంది. అన్నము పెట్టేస్తావా"? అన్నాడు.

"దానికేమిభాగ్యము. స్నానముచేసిరా. అల్లాగేపెడతాను"అన్నది ఆ అవ్వ.

భోజనము అయినతరువాత విస్తరిమడిచి ఎక్కడపారెయ్యాలని అడిగేడు ఆ అవ్వని.

"అదేమిపనయ్యా! నీబోటివాళ్లు ఎంతమందితిన్నారా ఇస్తట్లో. కడిగిదాచుకుంటారుకాని, నలిపిపారేస్తారా? రేపు ఎవరన్నావస్తే దేంట్లోపెట్టమన్నావు"అని తిట్టడంప్రారంభించింది. వెనుకటివాటికితోడు పులివిస్తరాకులోతిన్నపాపము ఒకటా అని నెత్తి, నోరు కొట్టుకుంటూ వెళ్లిపోయేడు బ్రాహ్మడు.

ఒకరోజు ఉదయము ఇంకో ఊళ్లోచెరువుగట్టునకూర్చుని మొహముకడుక్కుంటున్నాడాబ్రాహ్మడు. ఆరోజు ద్వాదశి. బ్రాహ్మణుడుగారావలసిందనిపిలిచింది ఒకముసలమ్మ. సరే అనివెళ్లేడు. భోజనము అయినతరువాత పాయసము మహాదివ్యంగా ఉన్న దవ్వాఅన్నాడు.

"యేంచెప్పను? నాయనా! పై, పైమీగడంతా కుక్కనాకిపోయిందికాని లేకపోతే ఇంకాబాగుండేది" అన్నది. బ్రాహ్మడికి పైప్రాణమునిలువుగాపోయింది. పెళ్ళాము ఎంగిలి తిన్నపాపము పోగొట్టుకుందామని కాశీకిపోతుంటె కుక్కఎంగిలికూడ తినవలసివచ్చింది. ఇంక భోజనము ఎక్కడచేయకూడదని తిన్నగాకాశీకిచేరుకున్నాడు.

కాశీకివెళ్లేటప్పటికి కనిచీకటిపడింది. ఎకాఎకి నదికివెళ్లి ఈపాపమంతపోవుటకు గంగలోమునిగికూర్చున్నాడు.

ఇంతలో ఒకపల్లెవాడు తండ్రిచచ్చిపోతే దహనముచేసి ఆబూడిద చూడకుండ ఈ బ్రాహ్మడి నెత్తిమీద గుమ్మరించేడు. ఛీ, ఛీ అని అంటూ ఆబ్రాహ్మడు పైకిలేచేడు. మాఅయ్య బ్రతికివచ్చాడని ఆపల్లెవాడు బ్రాహ్మడిని కౌగలించుకునిగందరగోళముచేయుట మొదలుపెట్టేడు. నేనుపొరుగూరి బ్రాహ్మడనని గోలపెట్టేడు. కాదు నీవు మా అయ్యవి, ఇంటికిరా అనిపల్లెవాడు ఈడ్చుకునిపోవడం ప్రారంభించేడు. చుట్టుజనంమూగేరు. పల్లెవాడు బ్రాహ్మడ్ని ఒదిలిపెట్టడు. మాఅయ్యనినేను ఇవ్వనంటాడు. కొత్వాలుదగ్గిరికితీసుకు వెళ్ళారాజనమంతా వీళ్లిద్దర్ని.

బ్రాహ్మడు కొత్వాల్‌తో తనగోడవంతాచెప్పి యేడ్చేడు. కొత్వాల్ ఈకథంతావిని తగినశాస్తి అనుభవించవయ్యా బ్రాహ్మడా అని, చచ్చిపోయిన అయ్య తిరిగి ఎల్లాబ్రతుకు తాడురా పిచ్చివెధవా అని పల్లెవాడికి నచ్చచెప్పి బ్రాహ్మణ్ణివదిలించేడుట.

## యామిని

శ్రీమతి షోడా ప్రగడ రాజ్యరత్నమ్మగారు

పున్నమచందురుండదిగో పూర్వపుదిక్కున దోచుచుండ నా
యన్నులమిన్న యామినికి యాననమల్లదె వెల్లనాయెడిన్
ఎన్నగ సద్గుణాలి యిల నేపువహింపుచునుండి కాలమా
సన్నమునొంద బ్రాభవము బాసి గికాగికలై దొలంగరే.

చల్లని జంద్రికాతతుల శాంతతనొందె విశాలలామ తా
నల్లదె భీతిబాఱి తరుఛాయల శ్రాంతినిగోరిచేరినన్
'జల్లనిరాజునుండి నిను చయ్యనగాచెదమమ్మ నీమనో
వల్లభు రాకగోరి' యని పాదపముల్దగ బుజ్జగించెడిన్.

సమతను వెంటనంటు నలజంద్రునిధాటికి నోర్వలేక దా
గమలినమోముఁవాంచి తరుకాండము సన్నిధి నేడ్చుచున్న యా
కమలముఖి న్గనుంగొనుచు కామినిగావగజాలకుంట నా
విమలహిమాంబురూపమున వేదననొందెడి వృక్షసంతతుల్.

తరుల విశాలశాఖల, లతాగృహము న్దగవిశ్రమించి దా
మరుదుగరాత్రివేళ నటయామిని రోదనమాలకించి యా
తురులయి లేచివచ్చి సతిద్రుంచెడి ధూర్తునిగాంచి వేదనా
పరతను దిట్టుచున్నవన పక్షులు రోదనచేయుచుండెడిన్.




## కీర్తనలు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

### ౧

రామ! నిన్నే నమ్మినానయా! పరంధామ! పలుకవేమయా!
రామ! రామ! యని రయమున బిలువంగ రామదాసుని బ్రోవలేదా నను గావవేమి? రా॥

సంసారబంధమున హింసచెందుచునుంటి । కంసాంతకా! నన్ను కరుణజూడుమితండ్రి! రా॥
వేదాంతవిధులెరుగ విజ్ఞానతతులెరుగ । వినతిమై నీపాదకనకాము భజియింతు రా॥
మనసునిశ్చలమూన మరినాకు తరమాన । నీనామతరణిచే నన్నింకదరిజేర్పు రా॥
శారీరమానసిక చింతాలచేసృక్కి । మనలేక నిన్వేడితి కనవే వినవే మనవి రా॥
అబల నగతికను అన్యమెరుగను దేవ! । ఆదరించియు నీదరిజేర్పు నను రామ! రా॥

### ౨

(శ్రీ రామచంద్రరా నే) వలె

రామకథామృతరసముగ్రోలుదమిట । రారమ్మ రమణులు వేవేగా ।
రామ! రఘువర! రావెయనుచును రా॥

కౌసలేయునియందు । ఘనభక్తినిల్పుదము । కాలయాపనలేక కడువేగా ।
కాంచనాంబర! కావవేయని రా॥

తారకనాముని । తరుణులందరుగూడి । తలచుచుభజియింప మేల్ మేల్ మేల్
తామసంబునువిడచియెంతయు రా॥

రామ! రఘురామ! యని । రయమునవేడిన । రక్షించుమనలను రాముండు
రక్షితామరుడాటచే నిల రా॥

సీతాసమేతుని । స్థిరముగనమ్మిటి । చిత్తశుద్ధిని నియ్య నౌ నౌ నౌ
సారసాక్షా! సత్యవతికిని రా॥

డాక్టరు కే. ఎన్. కేసరిగారి బంగారు పతక బహుమానమందిన వ్యాసము.

# గ్రామపునర్నిర్మాణము: స్త్రీలబాధ్యత

శ్రీమతి గంటి శేషమ్మగారు

[నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియను వారు ప్రతివత్సరము ఆంధ్రస్త్రీలకు వ్యాసరచనమున పోటీపరీక్ష నొకదానిని నిర్వహించుచున్నారు. ఆపరీక్షకుగాను పంపబడు వ్యాసములలో నుత్తమమగుదానికి డాక్టరు కే. యన్. కేసరిగారు ఒకస్వర్ణపతకమును ఇచ్చుచుండుటవాడుక. ఈవత్సరము పోటీవ్యాసము 'గ్రామపునర్నిర్మాణము: స్త్రీలబాధ్యత' అనువిషయమునుగూర్చి. ఇందుకు ముగ్గురు స్త్రీలు పోటీచేసిరి. శ్రీమతి గంటి శేషమ్మగారు రచియించిన క్రిందివ్యాసము బహుమానార్హమని పరీక్షాధికారులు నిర్ణయించిరి. మిగిలిన రెండువ్యాసములను క్రమముగ ప్రచురించి వానిపై మాఅభిప్రాయమును తెలుపుదుము.

—సంపాదకుడు]

గ్రామపునర్నిర్మాణమట! సరే, మంచిమాటే. పిమ్మట? స్త్రీలబాధ్యతయట! ఇదియొక క్రొత్తమాట. స్త్రీలకు బాధ్యత గలదని పురుషులనుట క్రొత్తగాక మరేమి? అయినను దీనిభావమేమో? స్త్రీలకుగూడ కొంత బాధ్యత ఉండవలసినదనియా వీరియభిప్రాయము? అట్లెందులకనుకొనవలెను? స్త్రీలకుగూడ బాధ్యతయున్నదని అంగీకరించిరనియే యనుకొందము. ఇట్లంగీకరించుటలో పురుషులభావమేమో? ఇంకను తెలియుటలేదు. పురుషులకుగూడ కొంతబాధ్యత ఉన్నదనిగాబోలు వీరియూహ. ఎంత అపోహము! ఎట్టి వెఱ్ఱిమాట! పురుషులకేటి! బాధ్యతయేటి! బాధ్యతఅంతయును స్త్రీలదే. ఏకార్యముపట్లఅయినను బాధ్యతను స్త్రీవహించినగాని పురుషులేమి చేయగలరు?

కాళీఘట్టము ననేకమంది చూచియేయుందురు. కాళికాదేవిఆలయమునుగూడ దర్శించియేయుందురు. శక్తిస్వరూపిణి, జగన్మాతను దర్శించకపోయినను స్మరించియైనను యుండకపోరుగదా. శివునిహృదయముమీద కాలునాని రౌద్రరసముట్టిపడునట్లున్న జగన్మాతయొక్క విగ్రహమునకర్థమేమో? ఎప్పుడైనాయోచించితిరా? పరాత్పరుడైనశివుడు అచలుడు. శక్తిహీనుడు. శక్తిలేనివాడేమిచేయగలుగును? సంపూర్ణబాధ్యతనువహించి శక్తిస్వరూపిణి సాహాయ్యముచేతనేగదా అనంతకోటి బ్రహ్మాండములను సృజియింపగలిగెను. అట్టిశక్తిస్వరూపిణియేగదా స్త్రీ. అట్టిసృష్టిస్థితిలయకారకురాలైనస్త్రీకి బాధ్యత ఉన్నదాయని శంకించుటగాని, ఉన్నయెడల యెంతవరకు అని నిర్ణయించుటకు పూనుకొనుటగాని పురుషులకు భావ్యమేనా! కాని ఒక్కమాట. కొంతవరకైన స్త్రీలకుకొన్నివిషయములలోనైన బాధ్యతగలదని మాసోదరులంగీకరించుటకు మొదలిడినారని వినుటకు సోదరీమణులెల్లరును సంతసించకమానరు.

ఇకమీదట గ్రామపునర్నిర్మాణము. దీనియర్థమేమో? ఇదివరకొకనిర్మాణ ముండియుండవలెనుగదా! ఆనిర్మాణమెట్టిది? అదియేమైపోయినది; తిరిగినిర్మాణముచేయుటకు? మొదటినిర్మాణముయొక్క స్వరూపమును తెలిసికొనుటకు చరిత్రయేగదా ఆధారము. పూర్వము హైందవసామ్రాజ్యము లత్యున్నతదశలో నుండు కాలమున చీనాదేశపువాస్తవ్యులు కొందరీదేశమునకువచ్చి హైందవనాగరికత సాటిలేనిదని మెచ్చుకొని దేశ

మందలి పరిస్థితులనన్నిటిని పూసగ్రుచ్చినటుల వారిదేశపు గ్రంథములలో వ్రాసియుంచిరని వినుచున్నాముగదా. వారేమని వ్రాసిరి? ఉత్తరహిందూస్థానమంతయును తిరిగినట్లును; అనేక దేశములను, గ్రామములను, పల్లెలను, పట్టణములను జూచినటులును; ప్రతిగృహమును విశాలమైనతోటను గలిగియుండెడినని వ్రాసినట్లుగా పూజ్యనీయులైన లాలాలజపతిరాయిగారు మిస్ మేయో దొరసానమ్మగారి గ్రంథమును పూర్వపక్షముచేయుచు వ్రాసినపుస్తకమునందు వ్రాక్రుచ్చిరని వినుచుంటిమి. ఎల్లెడలను అట్టినిర్మాణమేగల గృహములతో నిండియున్న దేశముయొక్క ఔన్నత్యోదశయును, నాగరికతయును, ప్రజలసౌభాగ్యమును, ఊహించుకొనుటకైన నలవిగాకున్నది. ఊహాతీతమైనను ప్రయత్నలోపముండగూడదుగదా.

గృహిణి గృహకార్యనిర్వహణానంతరము, తాటియాకులపాత్రము నొకదానిని చేబూని, యిరుగుపొరుగు సఖీమణులతో గలసి యేరామాయణమో, యేమహాభారతమో, యేభాగవతమో, లేకసంస్కృతకావ్యములో లేక ధర్మశాస్త్రమో, వేదాంతగ్రంథమోచదివి, పిమ్మట దొడ్డిలోనిపూలతోటలోనికిపోయి కొంతతడవువిహరించి, వికసించినపుష్పములను, ఒడిలోనికికోసికొని, పచ్చికపైనొకచో గూర్చుండి శీతలజలంబులతో పార్లి ప్రవహించు చిన్నినీటికాలువల ముఱముఱధ్వనులాలకించుచు చిత్రవిచిత్రములైన పూలహారములను గ్రుచ్చి శిరమునధరియించి పిమ్మట కొంతతడవునకు కూరగాయలతోటలోనికివెళ్లి రాత్రివంటకుగావలసిన కూరలను సమకూర్చుకొని గృహపారిశుద్ధ్యము చెడకుండనుండుటకుగాను ఇంటిని, దొడ్డిని, వాకిళ్లను పరిశుభ్రముగ తుడిపించి గోధూళివేళయగుటచే పశువులశాలను శుభ్రపరపించి పేడ, పెంట, చెత్త, చెదారములను ఇంటికి కొంతదూరములోనున్న పెంటగోతిలోపారవేయించి, మడిపదలినపిమ్మట, క్రీడాస్థలమునకుబోయి అత్యుత్సాహముతో గంతులువేయుచు, కేకలిడుచు ఇంటికితిరిగివచ్చుచున్న పిల్లలనుజూచి ఆనందించి, వారిచెమటదుస్తులను నియామకస్థలమునందుంపించి, ఒడలుకడిగి, వేరుదుస్తులనిచ్చి- కొంతసేపువిశ్రమించినతరువాత భోజనకాలమువరకును పాఠములను చదువుకొనమని బాలబాలికలను ప్రోత్సహించి, పిమ్మటమడిగట్టుకొని పాకశాస్త్రప్రకారమువంటజేయుచు, బిడ్డలుచదువుచున్న తప్పులనుదిద్దుచు, సందేహములనుతీర్చుచు, దినమంతయు పొలములో కష్టపడి పనిచేసివచ్చిన యజమానికి తననవ్వుమొగమును గనపరచి స్నానంబునకుష్ణోదకంబిడి, భోజనానంతరమున అందరునుగలసి కొంతతడవు ముచ్చటలాడుకొనినపిమ్మట బాలబాలికను వారివారి నియామకస్థలములలోపోయి పండుకొని ప్రాతఃకాలముననే మేల్కాంచి తమతమపాఠములను తిరిగి పునశ్చరణము చేయవలసినదని హెచ్చరించినపిమ్మట తానుశయనించునట్టి నారీమణినిబోలు అంగనలే అక్కాలమున, అగృహములను రంజింపజేయుచుండెడివారని ఊహించినను అసంపూర్ణ వర్ణనయేయగుచున్నది.

అట్టిగ్రామములు, అట్టియిండ్లు, అట్టిస్త్రీలు, అట్టి బాలబాలికలు యేరిఇప్పుడు? ఆగృహములన్నియు నేమైనవి? ఆసోదరసోదరీమణులందరు నేమైరి? ఆభారతవర్షమిదియేనా? వేరొండాయిది? లక్ష్మీసరస్వతుల కాటపట్టయివిలసిల్లి నవధాన్యసంపదలతో తులతూగుచుండి, ఎక్కడజూచినను శాస్త్రచర్చయే వినబడుచుండి, యెక్కడజూచినను బాహుబలపరాక్రమశాలులైన పురుషపుంగవులే గాన్పించుచుండి, కుబేరునిమించిన వణిగ్వరులతోను ఉత్సాహపూరితులైన కృషీవలులతోను నిండి, విరాజిల్లుచుండెడి ఆభారతవర్షయే యిది! ఏమి! ఇప్పటిదుస్థితి! బనారసుచీరగట్టి, సర్వాలంకృతయైన భారతమాతకేనా, యీచినిగినదుస్తులు! యీఅలంకారశూన్యత! యెచ్చటజూచినను గ్రామములు నిర్జనములైయున్నవి. సస్యములు నిండుఫలమిచ్చుటలేదు. స్త్రీపురుషులు క్షీణచ్ఛవులైయుండిరి. నైతికము మాసిపోయెను. ఉత్సాహమునశించెను. ఏవీధినిజూచినను పెంటరాసులే! ఏమూలజూచినను పెంటపోగులే! ఏగృహములోపలజూచినను సాలిగూండ్లే! గబ్బిలములే! ఈగలే!

కోమలే! ఏ పెరడుజూచినను పూలమొక్క ఒక్కటియైనను గానరాదుకదా, పచ్చనిపాదొక్కటియైనను గాన్పించదు కదా, ఏమంచి నీటిబావిని చూచుమన్నను చుట్టును బురదయేగదా? ఒకటననేల! ఎచ్చటజూచినను కస్మలమే. ఎచ్చటజూచినను దుర్వాసనయే! మంచినీటిచెరువులను బురదగుంటలనవలయునో, పురుగులగుంటలనవలయునో తెలియదుకదా. ఎంతవెదకినను ఒక్కపుస్తకభాండాగారముగాని, ఒక్కక్రీడాస్థలముగాని, పఠనమందిరముగాని, ఒక్కఉద్యానవనముగాని గానరాకున్నవిగదా. ఏగ్రామమునందైనను తనపేరైనను తాను వ్రాసుకొనగలిగిన సోదరీలు ఒకరిద్దరుకంటె హెచ్చుగాన్పించకున్నారుగదా! అట్టితఱిలో స్త్రీవిద్య యెట్టి స్థితిలోనున్నదని వేరేయడుగవలెనా? దేశమంతయును అజ్ఞానాంధకార బంధురమైయున్నది. ఒక్కపసిబిడ్డమొగమునందైనను చిఱునగవు గాన్పించదు. తీసుకకాళ్లు, ఊసరపొట్టలేగదా. అంధత్వము, బధిరత్వమునేగదా. శిశుపోషణయన్నమాటయే మరచితిమిగదా. ఏదున్నను, యేదిలేకపోయినను బాలుడుగాని, బాలికగాని పుట్టినప్పటినుండియు, పుట్టినప్పటినుండియు నననేల స్త్రీగర్భవతియైనప్పటినుండియుగూడ పుట్టబోవుపిల్లకుగాని, పిల్లవాడికిగాని పెండ్లెప్పుడు చేయుదుము, పెండ్లెప్పుడుచేయుదుమన్న యాతురతయేగాని వేరొండు కానరాకున్నది. ఇదేమిపాపము! పూర్వసువాసినీలలో ఆరునెలల పసికూనలెందరోగలరనివినుచుండుట యెంత విషాదకరము? గృహస్థధర్మమును స్వీకరించుటకు తగినవయస్సుగాని, అర్హతగాని, విద్యగాని, సంపాదనశక్తిగాని, శరీరారోగ్యముగాని ఉన్నదా లేదా యని విచారించు వారొక్కరును గానబడరేమి? స్త్రీలోకము నుద్ధరించుట కవతరించిన ఆదివిఘ్నవోయనదగిన శారదాగారికి ప్రజలేలయడ్డుతగిలిరి? శారదాబిల్లు ప్యాసైనను స్థితిగతులు యథాప్రకారముగనే ఉండుటకు కారణమేమి? ఇది, అదియననేల? దేశదౌర్భాగ్యము, గ్రామదౌర్భాగ్యము వర్ణనాతీతములై యున్నవనుటలో అతిశయోక్తి యేమున్నది?

దుర్భరము!!! దుర్భరము!!! అతిభయంకరము!!! అతి విషాదకరము!!! దుస్సహమైన దుస్థితిని వర్ణించుటలో నేమిప్రయోజనము? అట్లనగూడదు. లాభములేకేమి? తప్పక ప్రయోజనమున్నది. దుస్థితియందున్నారమని తెలిసికొనుటయే గొప్పలాభము. ఇదియే జ్ఞానోదయమున కారంభము. దుస్థితిని తెలుసుకొన్నప్పుడు కారణముల వరయకమానము. కారణములను తెలిసికొనినపిమ్మట వాటిని తొలగించుమార్గములను కనుగొనక మానము. ఇంతకంటె విముక్తి కేమికావలెను?

ఇంక కారణములను గమనింగొనవలయును గాబోలు. మహమ్మదీయుల దండయాత్రలు, పాశ్చాత్యుల రాకడ మున్నగునవి హేతువులని చరిత్రకారులు అనినను అందురుగాక. కాలమహిమయనియు, నెల్లకాల మొక్కతీరున నేయుండదనియు అనెడువారుండిన నుందురుగాక, కర్మకర్మయనివాదించు కర్మపిశాచబద్ధులైన పండితుల మాటలుగూడ అటుండనిండు. కాని నిజమైన కారణము లివియెవ్వియుగావని నాయల్పబుద్ధికి తోచుచున్నది. అట్లయిన నిజమైనకారణమెద్ది? చెప్పుటకుసాహసించజాలకున్నానుగాని చెప్పకతప్పదుగనుక చెప్పెదను. ఏకాలమునాడు, యేసంవత్సరమున, యేదినమున, యేముహూర్తమున, యేమహానుభావుడు జగన్మాత, ఆదిశక్తిస్వరూపిణియగు స్త్రీని 'అబల'యని పిలచెనో ఆకాలముననే, ఆవత్సరముననే, ఆదినముననే, ఆముహూర్తముననే హైందవదుస్థితి ప్రారంభమయ్యెనని చెప్పుటకు సాహసించవలసివచ్చినది. ఇదియే యదార్థము, నిజము. ముమ్మాటికినిజము. అట్లుగానిచో అవతారపురుషుడనిపిలువబడుచుండిన గాంధిమహాత్మునంతటివాడు తన యుద్యమమునకు స్త్రీలనేల తోడ్పడవలసినదని ప్రార్థించును? హైందవదుస్థితికి నిజమైన కారణమాయన గ్రహింపగలిగియుండుటచేతనేగదా,

మన మిప్పుడు ప్రధానకారణమును గనుగొంటిమి. ఆకారణమే విముక్తిమార్గమునుగూడ సూచించుచున్నది. ఆదృక్పథమును వదలక సోదరసోదరీమణులందరును పనిజేసినయెడల స్వర్గము కరతలామలకమే యగును. సోదరులనియంటిని. వారుకూడ ఇక్కార్యముపట్ల పూనుకొనిన సంతోషమే. లేకపోయినను లోటు రాదని నాధృఢనిశ్చయము.

ఇకకర్తవ్యమాలోచింతము. ఈగ్రామపునర్నిర్మాణకార్యభారమంతయు — పునర్నిర్మాణమనుటకంటె పునర్జీవనమనుటలో యెక్కువస్వారస్యమున్నదేమో — సోదరీమణులమీదనే యున్నదిగాన సోదరీమణు లందరును తమతమగృహములయందును, గ్రామములయందును చేయవలసినకార్యములను నిర్ణయింతము. విద్యావంతులైన స్త్రీలందరును తమతమగ్రామములోని విద్యావిహీనురాండ్రగు సోదరీమణులకు పూర్వము ఆర్యావర్తపుణ్యభూమియందుద్భవించిన సీత, సావిత్రి, దమయంతిమున్నగువారి పూజనీయమైన చరిత్రలనుజెప్పి అప్పటికాలపు స్త్రీలవిద్యా, దేహమనోబలములకును ప్రస్తుతకాలపు స్త్రీలయొక్క శక్తులకునుగల వ్యత్యాసములను చక్కగవచ్చచెప్పి, తాముగూడ అట్టిమహనీయురాండ్ర సాంప్రదాయములోని వారేయగుటంజేసి అట్టిశాశ్వతకీర్తినే తాముగూడబడయుటకు ప్రయత్నించులాగున ప్రోత్సహించవలయును. ఇట్టి ప్రబోధము కొంతవరకుజరిగినతరువాత ఏతల్లి తనబాలికలను పాఠశాలకు బంపకుండును? ఏతల్లి తనయాడుబిడ్డనుసంపూర్ణ విద్యావంతురాలినిగాజేయుటకుప్రయత్నించకుండును? "విద్యలేనివాడు వింతపశువ"న్నట్లుగా। విద్యాగంధమే కదా మానవుని పశువునుంచివేర్పరుచునది. అట్టివిద్యయేగదా సమస్తకార్యసాఫల్యమునకును పునాది. స్త్రీలందరును విద్యావంతులైనతతి నిర్జీవములైన గ్రామములన్నియు జీవకళలతోనిండి వసంతకాలపు లేమామిడి గున్నలవలెచిగిర్చి,పుష్పించివిరాజిల్లకుండునా! విద్యాగంధమున్న స్త్రీలున్న ఇండ్లలో సాలిగూండ్లును, పేడ కుప్పలును పెంటపోగులునుఉండునా? ఈగలు, దోమలు, గబ్బిలములు చేరసాహసించునా? బురద,దుర్వాసన యను మాటలైనవినబడునా? ఇంటిపెరటిలో పూలమొక్కలును, కూరగాయలచెట్లును, పాదులునుఉండునని వేరచెప్పవలయునా? ఆరోగ్యమార్గపద్ధతులును, శిశుపోషణాపద్ధతులును దెలియకుండునా? అట్టి ఇండ్లలో వ్యాధియనుమాట వినబడునా? బాలబాలికలు ఆరోగ్యవంతులై అంగసౌష్టవముగలవారలై విద్యాబుద్ధులను బడయకుందురా? అట్టిస్త్రీలున్న ఇండ్లయందును, గ్రామములయందును దారిద్ర్యదేవతకాలుపెట్టుటకు సాహసించునా? త్రాగుబోతులును, జూదగాండ్రును, దుండగీడులును నిలుచుటకుతావుండునా? ఆసేతుహిమాచల పర్యంతమును గలిగినసంచలనములో స్త్రీలేగదా ముందంజవేసి మద్యపానపిశాచమును రూపుమాపుటకు పూనుకొనిరి? అట్టిగ్రామములలో క్రీడావిహారస్థలములును, పఠనమందిరములును, పుస్తకభాండాగారములును ఉండకుండునా? అట్టిస్త్రీలుగల తావులయందు బాలవితంతువులుందురా? ఇష్టమైనయెడల వితంతువివాహములు గాకుండునా? గోతులలోనిలువజేసినపేడ, పెంటమొదలగువాటిని పొలములకుపయోగించిన పుష్కలమైన పంటలుపండవా? నగలు, నాణెములో అని విలపించుస్త్రీలెందరైనగాన్పింతురా? విద్య, సౌజన్యతకంటె వేరొండుభూషణములుగలవా? గ్రామములన్నియును పరపతిసంఘములతోను, బ్యాంకులతోనునిండియుండవా? ప్రతి ఇంటను మారువృత్తి ఉండకుండునా. తట్టలల్లిననేమి, బుట్టలల్లిననేమి? కోళ్లనుపెంచిననేమి, గొఱ్ఱెలనుపెంచిననేమి? తాడుపేనిననేమి, లేసుఅల్లిననేమి. ఏదోయొకమారువృత్తి. ఎక్కువగనున్న ధాన్యాదులను గ్రామస్థులందరును కలసియమ్ముకొని కావలసినసరకులన్నిటిని కలసికొని లాభమునుపొందకుందురా?

తుదిమాట. జ్ఞానోదయమైనది. జ్ఞానమార్తాండుడు తన ప్రచండకిరణములచే అజ్ఞానాంధకారమును పటాపంచలుగ జేయుగాక! సోదరీమణులెల్లరును ప్రాచీనభారతవర్షమును స్మరించెదరుగాక! స్మరించి తరించెదరుగాక! 'అబల' శబ్దములోని అకారము హరించుగాత! శక్తిస్వరూపిణి తన నిజస్వరూపమును దాల్చుగాత!




కాశీరాజు రామమోహనశర్మగారు

గతసంచికలో శ్రీమతి పాకల రత్నమాలగారిచ్చిన చిటికెలుపెటికలపాటను బాలికలు ఒక్కొక్క వ్రేలినితాకుచు పాడెదరు. తరువాత వ్రేళ్లుఅన్నియు పండినవని చేతులు వెనుకకు పెట్టుకుని ఈక్రిందివిధముగ పండినవారినడిగెదరు. అప్పటి సంభాషణయిది.

నీచేతులేమయ్యా వోయ్!
పిల్లెత్తుకుపోయింది.
పిల్లినెందాకా తరిమావు? గోలకొండదాకా.
గోలకొండ యేమిచ్చింది? గుడ్డిగవ్వ.
గుడ్డిగవ్వనేంజేశావు? కుమ్మరాఁడికిచ్చేను.
కుమ్మరేమిచ్చేఁడు? కుండిచ్చేడు.
కుండనేంజేశావు? మాతాత కిచ్చేను.
మీతాతేం జేశాడు? ముడ్డికడుక్కుని
గిఱగిఱా త్రిప్పి నూతులో వేశాడు.
నుయ్యేమిచ్చింది? నీళ్లిచ్చింది.
నీళ్లేం జేశావు?
పూలచెట్లకీ కాయలచెట్లకీ పోశాను.
పూలచెట్లూ కాయలచెట్లూ ఏమిచ్చేయి?
పువ్వులూ కాయలూ యిచ్చేయి.
పువ్వులూ కాయలూ ఏంజేశావు?
పువ్వులు మాఅక్కతలలో పెట్టేను
కాయలు నేనేతిన్నా.

మీఅక్కతల ఏమిచ్చింది? పేనిచ్చింది.
పేనునేం జేశావు? గడపమీద నొక్కాను.
గడపేమిచ్చింది? పేళ్లిచ్చింది.
పేళ్లేం జేశావు? పొయిలో పెట్టాను.
పొయ్యేమిచ్చింది? బూడిదిచ్చింది.
బూడిదేం జేశావు? పెంటమీద పోశాను.
పెంటేమిచ్చింది? గడ్డిచ్చింది.
గడ్డేంజేశావు? ఆవులకీ గేదెలకీ వేశా.
ఆవులుగేదెలు ఏమిచ్చేయి? పాలిచ్చేయి.
పాలేం జేశావు? పరమాన్నమొండా.
పరమాన్న మేంజేశావు?
నేనుతిన్నాను: మఱినాకో?
పీటకిందెడితే పిల్లెత్తుకుపోయింది.
ఉట్టిమీదెడితే ఉడుతెత్తుకుపోయింది.
మంచంమీదపెడితే మామఎత్తుకపోయాడు.
అటకమీదెడితే అల్లుడెత్తుకుపోయాడు.
నీకులేదు.

## చింత

శ్రీమతి ఆదుర్తి గున్నమాంబగారు

ఉ. కామము క్రోధమున్ మదముగప్పెను నీచపుమానసంబునన్
నేమము ధ్యానమున్ జపము నిత్యము నీమృదునామమంత్రమున్
బ్రేమచె జేయలేక గడుబిచ్చతనంబున బేలనైతిగా
ఏమియొనర్చి నన్నికను నేలెదవో జగదీశ! మాధవా!

ఉ. వీడగలేక సంసృతిని విత్తములందున నాశమానకన్
గూడితి నీచమానవులఁ గోమలమొప్పెడు నీదుభక్తులన్
న్నీడ చరింపలేకఁగడునిందకు పాత్రత గల్గునన్ను, నె
గ్గాడక నాదరింపగదె కౌస్తుభభూషణ! భక్తపోషణా!

ఉ. కాయము శాశ్వతంబనుచు గర్వమునొందుచు మాటిమాటికిన్
హేయపు దుష్టసౌఖ్యముల నెంతయు సంతసమందుచుంటచే
పోయెనుకాలమంతయును పుణ్యముసేయగనేరనైతి, నీ
మాయనెఱుంగగాగలనె మానిని నన్నెటుజూచిబ్రోచెదో?

ఉ. చేసితి పాపకర్మములు చిన్నటిప్రాయమునాటనుండి, నే
వేసితి మాయవేసములు, హీనులచేత భవత్కథాసుధన్
వాసిగఁ గ్రోలలేక గడువంచితనై దరిగానకుంటి, నో
వాసుకిశాయి! నన్నెటుల వక్రతమాన్పి తరింపఁజేసెదో.

ఉ. చలనములేని మానసము, సద్గురుపూజయు, నాత్మచింతయున్,
వలగొనినీకు మ్రొక్కుటయు, వైరములేమియు, వీతరాగమున్,
యిలఁగల దుష్టసౌఖ్యముల కెంతయు బాసిపనొకయుంటయున్
గలుగగజేయుమా యెపుడు కంజదళేక్షణ! సాధురక్షణా!

మ. ఉదయంబప్పటినుండి నీపదములే యొప్పారచింతించెదన్
మదిలోనించుకకిన్కబూన కెపుడున్ మన్నింపరావేదయన్
సదయాఖండవు నీవకావె తలపన్ సర్వజ్ఞ! సర్వేశ!నీ
సదసద్రూపము చూపవేమికరుణన్ సీతామనోనాయకా!

ఉ. భారమునీదె నన్నికను పాలనుముంచిన నీళ్లముంచినన్
నారదగానలోల! శుభనవ్యజలేజవిశాలలోచనా!
నేరములెంచబోక కమనీయకృపన్ గనుగొమ్ము, లెమ్ము, నో
వారిజసంభవాదిద్విజవందిత చరణారవింద! మాధవా!



## వితంతూద్వాహము శాస్త్రసమ్మతము:—

కావ్యతీర్థ బం. మల్లయ్యశాస్త్రిగారు కన్యదానముగూర్చి వివరించుచు పునర్వివాహము శాస్త్రీయమని ఇట్లు వ్రాయుచున్నారు:—

"మను. అ. ౯ శ్లో ౪౭ సకృదాహద దానీతిఅను దానివల్ల దానము ఒక్కమారే చేయవలసినది. కాని కన్యను తిరిగి దానముచేయుటకు తండ్రి కధికారములేదని శాస్త్రజ్ఞానము లేని కొందరు ప్రశ్నించుచున్నారు. దానమంటే "స్వస్వత్వనివృత్తి పూర్వక పరస్వత్వాపాదనమ్" అని శాస్త్రజ్ఞులు లక్షణము వ్రాసినారు. స్వత్వము అంటే హక్కు. దానముచేయువాడు దానము చేయదలచిన వస్తువయందు దనకున్న హక్కును వదలుకొని ఆహక్కును యెదుటవానికిచ్చుట అని లక్షణ తాత్పర్యముకదా. గోదానమును విమర్శింతము. గోవునందు తనకు ఎట్టి హక్కులున్నవి. అంటే దానిపాలు తాను త్రాగుటకు దానిని మరొకనికిచ్చుటకు అమ్ముకొనుటకు మొదలయిన అధికారములు తనకుగలవు. ఆహక్కునంతయు ఎదుటివానికి కలుగజేయుట గోదానమనబడును. దానముచేసిన తరువాత తిరిగి దానియందు తనకేవిధమైన హక్కును మరి యుండదు, దానికి పుట్టినదూడ తానేవిధముగా నుపయోగించుటకును హక్కులేదు. కన్యాదాన మట్టిదికానేరదు. కన్యయందు దానముచేయుటకు ముందు తండ్రికేమేమి హక్కులున్నవో ఆ హక్కులు అల్లున కివ్వలేదు. అల్లునకు ఏహక్కులు కన్యయందు తండ్రి కలుగచేసినాడో ఆహక్కులు తండ్రి కెప్పుడూలేవు. దానముచేసిన తరువాత కూడ తన కూతురకు తనకు ఉన్నసంబంధమట్టేయుండును. ఆపిల్లకడుపున కొడుకుపుట్టినపుడు తనకు కొంత జాతాశౌచముకూడ కలదు. మనమనికి తాతగారి శ్రాద్ధముచేయు కర్తృత్వముకూడ కలదు. కనుక దానమువల్ల తండ్రికి కన్యయం దిదివరకున్న హక్కులు యేవీ పోలేదు. దానాంతరము అల్లునకు భార్యఅయి వానివల్ల పిల్లలు కనుటకు కూతురుకిన్ని ఆమెయందు కనుటకు అల్లునకును దానమువల్ల హక్కులు కలుగజేసినాడు. ఆ హక్కు అదివరకు తనకూతురిమీద తండ్రికెపుడయినా కలదా? దానముచేసిన పిల్లను తిరిగి దానము చేయరాదనుచు పునర్వివాహము అశాస్త్రీయమనువారు శుద్ధమూర్ఖులని అందరు తెలిసికొందురు గాక. ఇది యంతయు మేధాతిధి తనభాష్యమున విచారించి వ్రాసినాడు. స్వకపోల కల్పనకాదు. వివాహ చతుర్థరాత్రి వరునితో సంభోగించునపుడు భర్తగోత్రము వధువునకు వచ్చును. అంతవరకుతండ్రిగోత్రములోనే కన్య ఉండును. ఇదిలేని బాలికావివాహములలో భర్త చనిపోయిన వితంతువు అక్షతవితంతువు. అట్టిదానికి పునర్వివాహము చేయుటకు తండ్రికే హక్కుగలదు. పునర్దానముకూడ తండ్రి గోత్రముతోనే. యిందు నర్దానము చేయవచ్చునని ఋషు లంగీకరించియుండగా నెవరు కాదనగలరు?"

### టర్కీ దేశపు వివాహ చట్టము:—

మార్చి 4—వ తేదీనాటి దీనబంధుపత్రిక ఇట్లు వ్రాయుచున్నది:—

"వివాహములవిషయమున ఐరోపాఖండమునందలి యితర దేశములలో గల పద్ధతులు టర్కీదేశమునం దింకను సరిగా నేర్పడియుండలేదని చాలమంది తలచుచుందురు. టర్కీదేశమున ఆరోగ్య సాంఘిక భీమా శాఖల మంత్రివర్గము వారిటీవల చేసినతీర్పు వివాహములు శిశురక్షణము మున్నగువాటికన్నిటికిని గూడ వర్తించుచున్నవి. "వివాహము చేసుకొనగోరిన స్త్రీలను పురుషులను వైద్యులు పరీక్షింపవలెను. సవాయి, సెగ, కుష్టు, పిచ్చి, కొరుకు మున్నగువ్యాధులు గలవారిని పెండ్లియాడుట కనుమతి నీయగూడదు. ఇట్టివ్యాధులు కల వారు సుప్రసిద్ధవైద్యశాలలలో సరియైన చికిత్సను బడయవలెను. వారికిగల వ్యాధి యితరులకు వ్యాపించునట్టి స్థితి దాటిపోయినదని గాని యితరులకు వ్యాపించదని గాని వ్యాధి కుదిరినదని గాని డాక్టరు సర్టిఫికెటును దాఖలుచేసిననేగాని పెండ్లియాడుటకు వారికి లైసన్సు యియ్యగూడదు. క్షయవ్యాధి తీవ్రముగా నున్నచో ఆరునెలలవరకును వివాహమును నిలిపివేయవలెను. అప్పుడుగూడ వ్యాధి వెనుకటివలెనే యున్నచో మరల ఆరునెలలవరకు నిలిపివేయవలెను. ఒకసంవత్సరమైనపిమ్మట చికిత్సచేయుచున్న వైద్యుడు వివాహముచేసు కొనగోరిన స్త్రీకిని పురుషునకునుగూడ ఆ వ్యాధివలన కలుగు అపాయమును గూర్చియును వివాహము చేసు కొనుటవలన కలిగెడు ఫలితమును గూర్చియును బాగుగా బోధింపవలెను. బిడ్డలకు పాలిచ్చునట్టి పాలదాయిలు క్షయ, సెగ, సవాయి మున్నగు వ్యాధులవలన బాధపడుట లేదని డాక్టరు సర్టిఫికెటును చూపించిననేగాని వారిని నియమించగూడదు. ఆరునెలలకొకసారి యీ దాయీలు మరల పరీక్ష చేయించుకొని సర్టిఫికెటును బడయుచుండవలెను. ఆహారపదార్థములు, పానీయములు మున్నగునవి అమ్మెడువారును, అమర్చెడువారును తలవెండ్రుకలనుదువ్వి జడవేయువారును మూడునెలలకొకసారి వైద్యపరీక్ష చేయించుకొని సర్టిఫికెటును తెచ్చుకొనుచుండవలెను. ఈ పనులను చేయుచున్న వారిలో నెవరికైన పైన వివరింపబడిన వ్యాధులు చర్మవ్యాధులు మున్నగునవియును తీవ్రముగ నుండువట్లు కనుగొనబడినచో వెంటనే వారిని తొలగింప మ్యునిసిపలు సర్జనులును వారు లేనిచోట గవర్నమెంటు డాక్టరులును ఉచితముగానే వైద్యపరీక్షను జరుపవలెను."

### చీనా దేశపు సేనానాయకురాలు:—

శ్రీమతి పులవర్తి కమలావతిదేవిగారు ఇట్లు లిఖింపుచున్నారు:—

"మహాభారతచరిత్రకాలమున వీరాంగనయై యర్జునునివంటి భారతవీరుని యుద్ధరంగమున ప్రమీలరాణి యెదిరించినది. యుద్ధమున కృష్ణునికి సత్యభామ తోడ్పడినను ఆమెయొక సేనకునాయకురాలై యుద్ధమునకు తలపడియుండలేదు. ప్రమీలకు పిమ్మట నే స్త్రీరత్నము నిప్పటివరకు సేనానాయకత్వమును వహింపలేదు. ఇప్పుడు ప్రపంచమునందంతటను స్త్రీ సేనానాయకురాలిని బడసిన యపూర్వగౌరవము చీనాదేశమునకు దక్కుచున్నది. హోనను సరిహద్దులయందు చాంగ్ అను వతని వితంతువు చాంగ్-క్యూ-ఫో మూడువేలమంది సైనికులపై నాయకురాలిగా నియమింపబడినది. ఆమె దళమున రెండువందల మరఫిరంగులుగలవు. ఆమె భర్త దుర్మార్గులగు దారిదోపిడి దొంగల నెదుర్కొనుచు మరణించెను. ఆమెను చీనాగవర్నమెంటువారే నాయకురాలిగా నియమించిరి. ఆమెకంగరక్షకులుగ నామె మరదండ్రు, అక్కలు, తోడికోడండ్రు మొదలగు ఆత్మపరివారములోని వారలే నియమింపబడిరి."




తోకగల బిడ్డ:—

టెన్నిస్సీలోని నాష్విల్లి యందు తోకగల ఆడపిల్ల పుట్టువొందినది. ఆతోక పొడవు ఏడంగుళములు. ఈమధ్య తోకతో పుట్టినపిల్లల కేసులు ప్రపంచమున ఇరువదిరెండుగలవు. అందు మిక్కిలి పొడవైనతోక తొమ్మిదిఅంగుళములది. ఈపొడుగుతోకబిడ్డ ఇండోచీనాకు చెందినది. గర్భమున పిండము మానవాకృతికి మారిన క్రొత్తదినములలో తోకయుండుననియు, ఆతోక ఆవ్యక్తి శరీరముయొక్క నిడివిలో ఆరుపంతులుండుననియు, క్రమముగ నది తగ్గిపోవుననియు, ఒక్కొకచో నది తగ్గకుండుటయు జరుగుననియు వైద్యప్రముఖులు వివరించుచున్నారు.

నాలుగుకాళ్లు నాలుగుచేతులుగల బిడ్డ:—

రాంచి సమీపమున నొకగ్రామమునందు ఒక మహమ్మదీయస్త్రీ నాలుగుకాళ్లు నాలుగుచేతులు గల బిడ్డను ప్రసవించెను.

రెండుతలల ఆవుదూడ:—

టిప్పరాజిల్లా కొమిల్లాయందలి పశువుల ఆసుపత్రికి ఈనజాలక బాధపడుచుండిన ఒక బుర్రిఆవు కొనిరాబడెను. పశువైద్యుడు దూడను బయటికి లాగగా దానికి రెండుతలలుండెను. దూడ వెంటనే చనిపోయెను.

రెండుతలల ఆడపిల్ల:—

నోక్ హాలీలోని బాబు కాలీమోహనశర్మఅధికారిభార్య ప్రసవించెను. ఆబిడ్డ కడుపులోనే చనిపోయెను. ఆబిడ్డకు శరీరము ఒకటియేగాని రెండుతలలుండెను. రెండు ముక్కులు, నాలుగుకళ్లు, నాలుగు చెవులు, నాలుగుచేతులు, నాలుగుకాళ్లు ఉండెను. తల్లి కులాసగ నున్నది.

కడుపులో ఉండగనే జాతి కనుగొనవచ్చును:—

ఎక్సరే సహాయమున తీయబడిన ఫొటోగ్రాఫులవలన ప్రసవకాలము ఇంకను మూడుమాసములున్నదనగనే కడుపులోనిబిడ్డ జాతికనుగొనవచ్చునని మిచిగనులోని డాక్టరు థోమసుగారు చెప్పుచున్నారు. జాతి కనుగొనుటకంటె ఈ విధానమువలన ఆబిడ్డకేమైన వైద్యసహాయము అవసరమేమో నిర్ణయింపవీలగుట ఎక్కువ లాభకరముగ నుండగలదని డాక్టరుగారు చెప్పుచున్నారు.

# డైరి

## ఫిబ్రవరి

20:—అహమ్మదాబాదులో జనాభాబహిష్కారము వానరసేనవారు తీవ్రముగసాగించుచుండిరి. పురపరిసరమగు సోమాతపూరులో గంగా అనునొకస్త్రీ జనాభాఉద్యోగికి సహాయపడెనని వానరసేనవారు ఆమె యింటిముందు సత్యాగ్రహముచేసిరి. ఆమె కాంగ్రెసుకార్యదర్శికి క్షమాపణచెప్పుకొనవలసివచ్చెను.

:—శ్రీమతి సరోజినినాయుడుగారు ఆరోగ్యమంతగ బాగులేకున్నను కాంగ్రెసుయాజ్ఞననుసరించి హైదరాబాదునుంచి ఢిల్లీకిబయలుదేరిరి.

21:—గుంటూరులో శ్రీమతులు గొల్లమూడి రత్నమ్మగారు, పాటిబండ పార్వతమ్మగారు, కొండా సత్యవతమ్మగారు గుంటూరుజిల్లా ఎనిమిదవకాంగ్రెసుసంఘాధ్యక్షురాలు, సహాయకార్యదర్శినులుగా ఏర్పడి తమపేర్లతో కరపత్రములనుప్రకటించి పంచిపెట్టిరి. పికెటింగుచేయుటయందు వాలంటీరులకు తోడ్పడవలయునని ప్రజలను హెచ్చరించిరి. ఆస్త్రీలుముగ్గురును పికెటింగుజరుగుచున్నచోటికి రాగానే క్రిమినలులాసవరణచట్టము 17(1)ప్రకారము అరెస్టుచేయబడిరి. వెంటనే పోలీసుస్టేషనుకుగొంపోబడిరి.

22:—మదరాసున తిరువల్లిక్కేణియందు జరిగిన జాతీయపతాకవందనోత్సవసందర్భమున శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు ఉపన్యసించిరి.

23:—కలకత్తాలో శ్రీమతి జనకకిశోరదేవిగారు పట్టణకాంగ్రెసుసంఘనియంత్రి క్రిమినలులా సవరణచట్టము 17 (౨) క్రింద ఆరునెలల కఠినశిక్ష నొందెను.

24:—శ్రీమతి జ్యోతిర్మయి గంగూలీగారి నాయకత్వమున స్త్రీప్రముఖులు పలువురు కలకత్తా పరిసరమగు మహిషపట్టణమున ఉప్పుసత్యాగ్రహముచేసిరి. అచటి స్త్రీపురుషులు వీరికితోడ్పడిరి. బెంగాలులో ఉప్పుసత్యాగ్రహమునకు ప్రథమస్థానము మహిషపట్టణము.

:—గుంటూరులో శ్రీమతులు కొరపాటివెంకమ్మ (కోపూరు), రామినేని రాజమ్మ (కొమ్మూరు)గార్లు అరెస్టుచేయబడిరి.

:—జలాల్పూరు తాలూకాలో శ్రీమతి మహాలక్ష్మి బెన్ గారికి 100 రూపాయిలు జరిమానా లేక 3 నెలల ఖైదు విధింపబడెను. ఆమె జైలుకేగెను.

25:—రాజమండ్రి స్త్రీలయున్నతపాఠశాలావార్షికోత్సవము ట్రెయినింగుకాలేజిప్రిన్సిపాలుగారి సతీమణి అధ్యక్షతనుజరిగెను.

:—ఆరుమాసముల శిక్షాకాలమునుముగించి శ్రీమతి పాదర్తి సుందరమ్మగారు రాయవేలూరు స్త్రీల చెరసాలనుండి విడుదలయైరి.

:—కరాచిసమరసంఘమునకు సప్తమనియంత్రియగు శ్రీమతి కస్తూరి జీవరాజ్ గారు అరెస్టుచేయబడిరి.

:—డోహాను (మిడ్నపూరుజిల్లా) గ్రామమున చౌకీదారి పన్నునిరాకరణకై శ్రీమతి ఉత్తమరాయి గారు అరెస్టుచేయబడిరి,

:—1. అంబుజమ్మ (శ్రీమాన్ ఎస్. శ్రీనివాసయ్యంగారి కుమార్తె) 2. జానకమ్మ (స్వర్గీయ సర్. వి. భాష్య అయ్యంగారికుమార్తె) 3. కుమారీ కృష్ణాబాయి బి.యె. 4. వాసుదేవరావుసతి 5. మాధవరావు సతి 6. గౌతమీదేవి(హరిహరశర్మగారిభార్య) 7. పెద్దాడ కామేశ్వరమ్మ బి.యె. 8. యామినీపూర్ణ

తిలకమ్మ 9. సుబ్బమ్మగార్లు మదరాసులో పికటింగు చేసినందులకు అరస్టు చేయబడిరి. అనారోగ్యకారణమున శ్రీమతి అంబుజమ్మాళ్ గారిని విడిచిపెట్టిరి.

26:—ఏలూరులో విదేశవస్త్రదుకాణముల పికటింగులో శ్రీయుతులు హెచ్.వి. సత్యవతీదేవిగారు (డా. జోగయ్యశర్మగారి భార్య-శర్మగారు మురిపిపలు సంఘోపాధ్యక్షులు, ప్రస్తుతము జెయిలులో నున్నారు), దుగ్గిరాల శకుంతలాదేవి, దుగ్గిరాల శేషమ్మగార్లు (అంగలూరు) పాల్గొనిరి.

:—లాహోరులో క్రి.ప్రొ.శో. 107 సెక్షను క్రింద 25 మంది స్త్రీ పికెటర్లకు చెరి 11 నెలల ఖిడిఖైదు విధింపబడెను.

27:—శ్రీమతి పల్లూరు వెంకాయమ్మగారు రెండువేలరూపాయిలు వెచ్చించి బెజవాడ గవర్నరుపేటలో నున్న రామమోహన లైబ్రరీకి చేర్చి స్త్రీశాఖాభవనమును కట్టించిరి. ఈరాత్రి 9-45 గంటలకు గృహప్రవేశము జరుపబడినది. స్త్రీల నేతలు శ్రీమతి వెంకాయమ్మగారిని బ్యాండువాయిద్యములతో నూరేగించి నూతనభవనమునకు తీసుకొనివచ్చి పూర్వాచారపద్ధతి ననుసరించి గృహప్రవేశాదిశుభకార్యములను వేదోక్తముగా నెరవేర్చిరి. శ్రీమతి కవయిత్రి ఇందుమతీదేవిగారు వారిభర్తతో పీటలమీద కూర్చుని పూజసల్పిరి. ఈనూతనభవనమునకు శ్రీరాధాకృష్ణానందాశ్రమమని నామకరణము చేయబడినది.

28:—వీరంగంతాలూకా తృతీయమహిళానియంతయగు శ్రీమతి చందన్ బేన్ సతిగారు క్రిమినలులాసవరణ చట్టము 17 (1) క్రింద అరెస్టు చేయబడిరి.

:—కలకత్తాలో జనపవారపనివాండ్ర సంఘాధ్యక్షురాలగు డాక్టరు ప్రభావతిదాసుగుప్తగారు బారకుపూరు సబుడివిజనులోకి రాకూడదనియు, పనివాండ్రను పనిలోనుండి పొమ్మని ప్రోత్సహింపరాదనియు నిషేధించుచు ప్రభుత్వము వారు ఉత్తరువు జేసిరి.

## మార్చి

1:—శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు తమకు విధింపబడిన 9 నెలల ఖైదును పూర్తిచేసి రెఱవాడా జైలునుండి విడుదలనొంది బొంబాయి చేరిరి.

2:—ఢిల్లీలో సత్యాగ్రహమునందధికముగ పాల్గొనుచున్న శ్రీమతి పార్వతీదేవిగారి తలిదండ్రులు అసనోల్సులులోనున్నారు. ఆమెకు అస్వస్థగానుండుటచే పుట్టినింటికి వెళ్లెను. 24 గంటలలో ఆమె అసనోల్సు నుండి వెళ్లిపోవలెనని 144 సెక్షను క్రింద ఆమెకు ఉత్తరువు అందజేయబడెను.

:—ఉప్పుసత్యాగ్రహము చేసినందులకుగాను బొంబాయిలో డి. వార్డనియంత్రి కుమారి రతీబెన్ మెహతాగారికి 3 నెలలు ఖిడిఖైదు విధింపబడెను.

:—ఏలూరులో మీరాబాయిచరఖాపాఠశాల డాక్టరు శృంగారకవి పాపారావుగారి గృహమున శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారిచే నడుపబడుచున్నది. రాట్నముపైని నూలువడుకుట, ప్రత్తియేకుట, ఏకులను చేయుట శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు నేర్పుచున్నారు.

3:—మదరాసులో పికటింగు సందర్భమున అరస్టు చేయబడిన 1. జ్ఞానమ్మాళుగారు (కీ.శే. సర్. భాష్యం అయ్యంగారి కుమార్తె) 2. కుమారికృష్ణబాయి (రాజాసర్. టి. మాధవరావుగారి మనుమరాలు) 3. శారదాబాయి (వకీలు వామదేవరావుగారి భార్య) 4. ఇందిరాబాయి మాధవరావుగారు 5. గౌతమి అమ్మాళ్ గారు (హిందీప్రచారక హరిహరశర్మగారి భార్య) 6. శివరాజు సుబ్బమ్మగారు 7. పెద్దాడ

కామేశ్వరమ్మగారు బి. యె, 8. యామినీపూర్ణతిలకమ్మగారు (హిందూయువతీశరణాలయస్థాపకురాలు) విచారింపబడి చెరి 6 నెలలవిడిశిక్షను పొందిరి.

—ఏలూరులో తీవ్రముగా సాగుచున్న పికెటింగులో శ్రీమతులు హెచ్. వి. సత్యవతీదేవి, సత్తిరాజు శ్యామలాంబగారు, ముదుంబి స్వరాజ్యలక్ష్మమ్మగారు, మఱియొక పదియేండ్లబాలిక పాల్గొనిరి.

4:—నిన్నను 6 నెలలుశిక్ష విధింపబడిన మదరాసు స్త్రీ సత్యాగ్రహులు ఎనమండుగురు వేలూరు మార్చబడిరి. వెంటనొక ఆంగ్లోయిండియను స్త్రీయు పోలీసువారును ఉండిరి.

:—బెజవాడలో శ్రీమతి సుభద్రమ్మగారి అధ్యక్షతను శాంతిపర్వసభజరిగెను. సుభద్రమ్మగారి చేతులనుండి బలవంతముగ పోలీసువారు జాతీయపతాకమును లాగివేసిరి. పిమ్మట శ్రీమతి దుర్భా వేంకటరమణమ్మగారు మఱియొక పతాకమును అక్కడనే ప్రతిష్ఠించిరి.

:—గుంటూరులో శ్రీమతులు గాదె సుబ్బమ్మ, కిలారి రంగమ్మ, పరుచూరు నాంచారమ్మగార్లు పికెటింగు నేరముక్రింద అరెస్టుచేయబడిరి.

6:—గుంటూరులో దేశభక్త వెంకటప్పయ్య, అనంతాచారిగార్లను ఎరస్టుచేయగా శ్రీమతి సరళాదేవిగారు రేడాదివయసుగల తనపుత్రునెత్తుకొని నాయకత్వమువహించి ఊరేగింపును జరిపెను. పోలీసువారు లాఠీచార్జి చేసిరి. పలువురు పురుషులతోబాటు అన్నాప్రగడ కామేశ్వరరావుగారి భార్యకు గట్టి దెబ్బలు తగిలెను. కామేశ్వరరావుదంపతులను ఎరస్టుచేసిరిగాని పిమ్మట ఆమెను విడుదలచేసిరి.

7:—శ్రీమతి సరోజినిదేవిగారు డిల్లీలో జాతీయపతాకమునునెలకొల్పుచు పతాకముయొక్క మహిమను గూర్చి ఉపన్యసించిరి.

8:—ఒడంబడిక ననుసరించి వేలూరుజయిలునుండి విడుదలపొందిన ముప్పదియొనమండుగురు స్త్రీసత్యాగ్రహులు మదరాసువచ్చిరి. ఘనముగ స్వాగతమీయబడెను.

9:—

10:—దువ్వూరి సుబ్బమ్మగారు పెద్దాపురము హైస్కూలులో స్త్రీవిద్యనుగూర్చి ఉపన్యసించుచుండగా పోలీసువారు లాఠీచార్జి చేసిరి. సుబ్బమ్మగారికి కాలిపై బలమైనగాయము తగిలెను.

:—శ్రీమతి కమలాదేవిఛటోపాధ్యాయిగారు మదరాసువచ్చిరి.

11:—భీమవరములో విదేశవస్త్రముల పికెటింగునందు గౌరవకుటుంబములకు చెందిన స్త్రీలు పాల్గొనిరి. డాక్టరు సుబ్బారావుగారి భార్యయగు శ్రీమతి చెన్నాప్రగడ సరస్వతమ్మగారు, శ్రీమతి హద్దేనూరి సీతారామమ్మగారు, ప్రయాగ సోమసుందరముగారిభార్య నరసమ్మగారు, సత్యాగ్రహమునకై జయిలు కేగివచ్చిన వారణాసి సీతమ్మగారు, న్యాయవాది ములుకుట్ల సుబ్బారాయుడుగారి సతీమణియు పికెటింగుచేసిరి.

12:—మదరాసులో డెబ్బదిముగ్గురు స్త్రీలు పసుపుచీరలను ధరించి చాలకట్టుదిట్టములతో పికెటింగుచేసిరి.

:—శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయిగారు కారాగారవిముక్తలైనవెనుక మొదటిసారి మంగుళూరుకి వెళ్లిరి. గొప్పఊరేగింపుజరిగెను. కమలాదేవిగారు జాతీయపతాకను ప్రతిష్ఠించిరి.

13:—బెంగాలు నారీసత్యాగ్రహసమితిలో నొకప్రముఖురాలగు చమేలీదేవిగారు కలకత్తాలోమరణించిరి.

14:—కీ. శే చమేలీదేవి స్మారకసభ శ్రీమతి మోహినిదేవిగారి అధ్యక్షతను కలకత్తాహాలీడే పార్కులో జరిగెను. "చమేలీదేవి సత్యాగ్రహమున పాల్గొని అక్రమప్రోత్సాహశాసనముక్రింద 6 నెలలశిక్ష

నొందెను. జైలులో ఆమె మగశిశువును గనెను. ఆశిశువప్పుడే మరణించెను. అప్పటినుండియు ఆమెకు బాలింతరోగమువచ్చిఆఖరుకు ఆమె మరణించెను."

15:—అనంతపురము రాజకీయోన్నతబోధనాభ్యసన పాఠశాలావరణమునందు బళ్లారిమహమ్మదీయ బాలికా పాఠశాలల పరిశీలనాధికారిణి శ్రీమతి ఎస్. డిసౌజాసతి బి.యె. ఎల్. టిగారి యాజమాన్యమున ప్రస్తుతవిద్యార్థినులు బడివిడిచివెళ్లెడి విద్యార్థినులకు వీడ్కోలువిందుగావించిరి.

16:—బొంబాయిరాష్ట్రీయస్త్రీలసభ అవంతికాబాయి గోక్లేగారి అధ్యక్షతను జరిగెను. ఆసభలో నుపన్య సించుచు పండిత జవహరిలాల్ నెహ్రూగారు స్త్రీలే భారతమాత దాస్యవిమోచనమును సాధింపగల రని చెప్పిరి.

17:—ఆంధ్రఆయుర్వేదఫార్మసీ ఉద్యోగులును, ఇండియన్ ఎక్విటబిలుఇన్సురెన్సుకంపెనీ ఉద్యోగులును కలిసి సత్యాగ్రహోద్యమమున ప్రథమశిక్షితురాలగు ఆచంట రుక్మిణమ్మగారికి స్వాగతపత్రముసమర్పించిరి.

:—యావద్భారతమహిళావిద్యానిధిసంఘసమావేశము ఘనతవహించిన ఇర్విన్‌ప్రభువుగారి అధ్యక్షతనుజరిగి నది. హైదరాబాదు నవాబుగారు 2లక్షలు, సర్ విక్టర్ శాసూనుగారు 50 వేలు, జెయపూరు మహారాజా గారు 8 వేలు, మఱియొక స్త్రీ 8 వేలు విరాళముల నొసగినట్లు నిధికోశాధ్యక్షుడు సభలో తెలిపెను.

18:—

19:—స్త్రీలకు పురుషులతో సమానహక్కు లొసగబడుటకు రాబోవు కరాచికాంగ్రెసులో నొక తీర్మా నము గావింపబడకోరుటకు కొందరు బొంబాయి స్త్రీలు పెక్కుసంతకములతో నొకతంతిని మహాత్మా గాంధి,వల్లభాయిపటేలు, జవహరలాలు నెహ్రూగార్లకు పంపిరి.

# పత్రికాపరిచయము

సురభి:—

సామాజికసారస్వతసచిత్రమాసపత్రిక. సంపాదకులు బి.టి. నరసింహాచార్యులుగారు. పత్రిక డెమ్మీ సైజున 40 పుటలు. సంవత్సరచందా రు 1-8-0. ఫిబ్రవరి 15-వ తేదీని వెలువడిన ఈ నూతనాంధ్రమాసపత్రిక యొక్క తొలిసంచిక విమర్శనార్థము మాకార్యాలయమునకు బంపబడినది. ఈసంచికయందు గౌరవస్థానము గూడపల్లి రామబ్రహ్మముగారి "బొబ్బరింతలు"అను వ్యాసమునకీయబడినది. ఈవ్యాసము తేర్చిన తెనుగుదనపు హెచ్చరికతో పర్యవసితమగుచు పఠనీయముగనున్నది. వేగినిగూర్చి లోగడ విశ్వనాథము సత్యనారాయణగారు వ్రాసిన మనోహరపద్యవ్యాసమునుండి ఉత్తేజకరమగు నొకసీసపద్యమునెత్తి 'ఆంధ్రభూమి' అనుశీర్షికతో ప్రచురింపబడినది. కొసరాజు రాఘవయ్యచౌదరిగారు 'ఆంధ్రభాషామతల్లి' అనుశీర్షికగల సీసపద్యవ్యాస ములో రాజరాజు, శ్రీకృష్ణదేవరాయలు, రఘునాథరాయలతో బాటు బ్రౌనుదొరనుకూడ భాషోద్ధారకులలో జేర్చి తమ ఉచితజ్ఞతను ప్రకటించినారు. 'ఇంకె పెండ్లియాడుటకేమి యాటంకము?' అనుపేరుతో సాంసా రికమగు నొక చక్కనికథను ఎస్.జి. ఆచార్యులుగారు వ్రాసియున్నారు. వితంతుకార్యాలయము, పాడు ముండా ఫొటోలు, మహారోగపుదునోగీ, తొకలు, ఆంధ్రనాటకరంగం అనుశీర్షికలుగలవి మిగిలిన వ్యాస ములు. 'సురభి' తెలుగుదేశమును సురభీకరించుచు చిరకాలము వర్ధిల్లుగాక యని కోరెదము. వలయువారు మదరాసునందలి చైనాబజారురోడ్డు 78-వ నెంబరుగల గృహమునసున్న సంపాదకులకు వ్రాయునది.

**సుధ:—**

'సుధ' యను తెలుగుమాసపత్రికయొక్క వార్షికసంచిక మాకార్యాలయము నలంకరించినది. ఇదియు తెయిటు కాగితములపై సుందరముగ ముద్రింపబడిన మహనీయుల వ్యాసములతో నొప్పుచున్నది. స్థలాభావముచే దీనినిగూర్చి మాఅభిప్రాయము ఈసంచికలో వివరముగ తెలుపజాలక పోయితిమి. వైమాసపుసంచికలో తెలుపుకొనగలము.

**కాంగ్రెస్:—**

జాతీయోద్యమప్రచారమును దివ్యముగ జరిపి ఆంధ్రదేశమునకు కాంగ్రెసురంగమున నొక ప్రధాన స్థానమును గొనివచ్చిన ఆంధ్రవారపత్రికలలో 'కాంగ్రెస్' పత్రిక యొకటి. అదిముద్రణశాసనమునకు గురియైనది. తొమ్మిదిమాసముల నిర్బంధవిశ్రాంతి అనంతరము మరల "కాంగ్రెస్" ప్రజోత్పత్తిసంవత్సరాదినాడు వెలుగునుచూచినది. ఆంధ్రమహాజనులు యథాప్రకారము కాంగ్రెసుపత్రిక నాదరింతురుగాక! పత్రికను ఎంతటిఉచ్చస్థితిలో ఆంధ్రులకు అప్పగించి పత్రికాసంపాదకులగు మద్దూరి అన్నపూర్ణయ్యగారు కారాగారమునకు పోయియున్నారో వారు వచ్చులోపలపత్రికను మరల అంతటి ఉచ్చస్థితికి గొంపోవవలసిన భారము ఆంధ్రప్రజలది. కాంగ్రెసుపత్రిక నిరంతరాయముగాసాగునట్లు పరమేశ్వరుడు అనుగ్రహించునుగాక! ప్రస్తుత సంపాదకులు క్రొవ్విడి లింగరాజుగారు. సాలు చందా రు 3-0-0. చిరునామా కాంగ్రెస్, సీతానగరము, తూర్పు గోదావరిజిల్లా.

# గ్రంథవిమర్శనము

**జానకీశతకము:—**

కల్లికోట కళాశాలలో నుపాధ్యాయులగు కొవ్వలి వేంకటరాజేశ్వరరావుగారిచే భక్తిపూర్వకముగ రచియింపబడిన శతకము. గ్రంథమున గ్రంథకర్తగారి ఛాయాచిత్రము కలదు. కీ. శే: మారెళ్ల గంగరాజు పంతులుగారి ధర్మపత్ని సుబ్బలక్ష్మమ్మగారి ధనసాహాయ్యమున ఇది అచ్చొత్తింపబడినది. డెమ్మీసైజున 26 పుటలు. వెల రు. 0-4-0. కలయువారు గ్రంథకర్తగారిపేర బరంపురము వ్రాయునది.

**హైందవస్త్రీలు:—**

ఉత్తమ పుస్తక మాలిక ప్రథమపుష్పము. సంపాదకుడు వేంకటరత్నముగారు. 1900 సంవత్సరమున జనవరి 18-వ తేదీని కాలిఫోర్నియాయందలి 'పాసడీనా' లోషేక్స్పియర్ క్లబ్ భవనమున స్వామి వివేకానందగారు చెప్పిన ఉపన్యాసము ఆంగ్లమున నిటీవల ప్రకటింపబడినది. దానికి ఆంధ్రానువాదమిది. మూలాభిప్రాయములు చక్కగ అనువదింపబడినవి. అనువాదకశైలియు ఆదరణీయముగనున్నది. స్త్రీవిద్యాభిమానులాదరింపదగిన గ్రంథము. గ్రంథముద్రణాదులు ముచ్చటగ నున్నవి. వెల రు 0-2-0 అణాలు మాత్రము. క్రౌనుసైజున 42 పుటలు. కలయువారు ఉత్తమపుస్తకమాలిక, తెనాలి అను చిరునామాకు వ్రాయవలయును.

**గడబిడ పంచాంగము:—**

క్రొత్తసంవత్సర సిద్ధాంతములు హాస్యరసపోషకములుగ నుండునట్లు వ్రాయబడినవి. గ్రంథము చిన్నసైజున 16 పుటలు. కలయువారు పోస్టుఖర్చులకుగాను ఒకఅణాబిళ్ల పంపిన గ్రంథము ఉచితముగ పంప

బడును. గ్రంథకర్త పట్టిసపు శ్రీరామమూర్తిగారు. వారి చిరునామా గవరవరం పోస్టు, వరహాపురం. గ్రంథములు వారికడ దొరకును.

భక్తకల్పద్రుమశతకము:—

ఖాద్రి నరసింహసోదర విరచితము. మైసూరుమహారాజాకళాశాల తెనుగుపండితులగు శ్రీయుత రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిచే పరిష్కృతము. మత్తేభశార్దూలవృత్తములలో చెప్పబడినది. క్రౌను సైజున 40 పుటలు. వెల 0-3-6. అనంతపురము సాధన ముద్రాక్షరశాలయందు 1931-వ సంవత్సరమున ముద్రితము. వలయువారు ఈచిరునామాకువ్రాసి తెప్పించుకొనవచ్చును: కదిరి శ్రీనివాసాచార్యులు, కార్యదర్శి, యువకవితాసమితి, కదిరి, అనంతపురంజిల్లా.

కుస్తీ:—

మల్లయుద్ధబోధిని. మల్లవిగ్రహమును నేర్చుకొనగోరు ఆంధ్రయువకులకీగ్రంథము అత్యంతసహకారి కాగలదు. ఇట్టి ఉత్తమగ్రంథమును రచియించి ఆంధ్రభాషాయోషకొక అమూల్యాలంకారమును ప్రసాదించిన శ్రీయుత భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారిని మేము మనఃపూర్వకముగ కొనియాడుచున్నాము. ప్రతిఆంధ్రయువకుడును ఈగ్రంథము నొక్కొక్కప్రతినిదీసి మల్లవిద్యాభ్యాసమునకు దొరకొని శరీరపాటవపరిపోషణమున పర్యాప్తులగుదురు గాకయని హెచ్చరించుచున్నాము. గ్రంథము చిన్నసైజున 72 పుటలు. గ్లేజుకాగితములు. మూల్యము 0-6-0 అణాలు మాత్రము. ఈగ్రంథము వలయువారలు భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు, రామచంద్రపురము, తూర్పుగోదావరిజిల్లా అనుచిరునామాకు వ్రాయవలయును.

బ్రహ్మచర్యము:—

ఆదర్శగ్రంథమాలా ప్రథమపుష్పము. పాలడుగు శేషాచలార్య, ఆరికపూడి వేంకటరామచౌదరిగార్లు రచియించినది. బ్రహ్మచర్యముయొక్క ఉత్కృష్టత, దానివలని లాభములు, దానినియమములు మొదలగు విషయములు కూలంకషముగ వేదములనుండియు ఉపనిషత్తులనుండియు గ్రహింపబడిన ప్రమాణములతో వివరింపబడినవి. హిందూదేశజులు తాము గోల్పోయిన ఆర్యత మరల సంపాదింపవలయునన్నచో బ్రహ్మచర్యదీక్ష దీక్షతో నవలంబింపవలయును. అట్టి అవలంబమునకు దేశభాషలయందు ఇట్టి గ్రంథములు ప్రచురించుట సహకారియగును. కావున విశేషవ్యయమునకోర్చి ఈగ్రంథమును సుందరముగ ముద్రించి దేశీయుల కర్పించిన ఆదర్శగ్రంథమండలి సంపాదకులగు గద్దే లింగయ్యచౌదరిగారిని మేమెంతయు కొనియాడుచున్నాము. గ్రంథము క్రౌనుసైజున 236 పుటలు. గ్లేజుకాగితములు. వెల చందాదారులకు రు 1-4-0. ఇతరులకు రు 1-8-0. దొరకుచోటు ఆదర్శగ్రంథమండలి, ఎలమర్రు, కృష్ణాజిల్లా.

జీవనప్రభాతము:—

శ్రీయుత కే. యస్. వేంకటరమణి యమ్. ఏ. బి. యల్ గారి Murugan the Tiller అను ఆంగ్లనవలకు ఆంధ్రానువాదము. అనువాదకులు శ్రీయుత పోలవరపు రామబ్రహ్మముగారు యమ్. ఎ. ఇది ఆంధ్రగ్రంథమాలలో పదునేనవకుసుమముగా ప్రచురింపబడినది. "భరతఖండమునందు వర్తమానకాలమునందు పాశ్చాత్యవిద్యావిధానము, పాశ్చాత్యసంస్కారము, పాశ్చాత్యాదర్శములు గలుగజేయుచున్న మహాసంక్షోభమును గ్రంథము హృద్యముగను విశదముచేయుచున్నది" అని గ్రంథప్రకాశకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు గ్రంథాదిని 'సూచన'యందు వ్రాసినవాక్యము లెంతయునొప్పియున్నవి. మురుగేశుని భ్రష్టత, కేదారి స్వార్థపరాయణత, రామచంద్రుని ఆదర్శకత చక్కగ ప్రదర్శితములు. అనువాదమున శైలి

కొంచము జటిలముగనున్నది. ఉత్తమశ్రేణికి చెందిన ఈనవలలను తెలుగువారి అందుబాటులనుంచిన గ్రంథకర్త గారిని ప్రకాశకులను మేము మనఃపూర్వకముగ నభినందించుచున్నాము. గ్రంథము విశేషప్రచారమునందు గాకయని కోరెదము. క్రౌనుసైజున 476 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు ౧-౮-౦ మాత్రము. దొరుకు చోటు ఆంధ్రగ్రంథమాల; 6, 7 తంబుశెట్టివీధి, జార్జిటవున్, మదరాసు.

## అనాథబాలిక:—

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచియింపబడిన సాంసారికమగుచిన్నవనల. స్త్రీలీనవలను మిక్కిలి అప్యాయముగ జదువగలరు. వారికి అర్థముకాని కఠినపదములు మందువకైనలేవు. పోనుపోను గ్రంథశైలి సంభాషణశైలియందు లీనమగుచు భాషావిషయమున గ్రంథకర్తయొక్క భావపరిణామము తెలియు టకు ఉపకరించుచున్నది. శైలికంటె ఆకర్షణీయమగుచు నిందలి ఇతివృత్తము ఒప్పుచున్నది. వేంకటరత్నము విషాదజీవితము పాఠకుల హృదయగోళమును పగిల్చివేయునదిగానున్నది. ఇది ప్రథమభాగము. ఇంతవఱకు అనాథబాలిక ప్రశక్తిలేదు. అనాథబాలికయగు రుక్మిణికథను వర్ణించు తుదిఘట్టములు సుందరతరములు; తెలుగు వారిగృహమర్యాదలను ప్రదర్శించు ఫలకములు. ప్రతిస్త్రీయు అవశ్యము పఠింపదగిన ఉత్తమగ్రంథము. క్రౌను సైజున 136 పుటలు. వెల రు 0-10-0 మాత్రము. దొరుకుచోటు పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు: కలాభివర్ధనీ పరిషత్తు; ఇన్నీసుపేట; రాజమండ్రి.

## సావిత్రీదేవి:—

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కృతము. చిన్నతరగతులలోఁ జదువు బాలబాలికలకు ఆర్యచరి త్రలతో పరిచయము చేయు పవిత్రోద్దేశముతో ఈ గ్రంథము రచియింపబడినది. ఆర్యవాఙ్మయము సృష్టించిన ఉత్తమస్త్రీపాత్రలలో సావిత్రీదేవి యొక అమూల్యరత్నము. ఆమె చరిత్ర యుగయుగములనుండి భారత స్త్రీలకు ఆదర్శజ్యోతి. అట్టి ఆమె చరిత్ర మీగ్రంథమున సులభసుందరమైన వచనమున ప్రస్తరింపబడినది. యథోచితములైన చిత్రపటములు గలవు. గ్రంథముద్రణాదులుకూడ సుందరముగ నున్నవి. చిన్నసైజున 148 పుటలు. వెల రు. 0-4-0. ప్రకాశకులు వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు. 292, ఎస్ప్లనేడ్; చెన్నపురి. ఈ.

## శ్రీమదుపనిషత్కథలు:—

వేదములన మూడవ భాగమగు నుపనిషత్తులం దటనట విద్యాస్తత్త్వార్థమును సంప్రదాయజ్ఞాపనార్థము నాఖ్యాయికలు కూర్చబడినవి. ఆ ఆఖ్యాయికలు నీతిగర్భితములు. అట్టి కథలు కొన్నిటిని బాలురు తెలిసికొ నుటకనువగురీతిని తెలుగువచనమున పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు వెలయించిరి. శాస్త్రిగారు పీఠికా పుర మహారాజ సంస్థానాంధ్రపండితులుగ నుండి కీర్తిశేషులైరి. ఆంధ్రబ్రహ్మసూత్రభాష్యము, శుక్రనీతి సారము రచించిన పండితులగుట వీరిరచనమునుగూర్చి ప్రత్యేకము చెప్పవలసిన పనిలేదు. గ్రంథము క్రౌను సైజున 60 పుటలు. వెల రు. 0-8-0. దొరుకుచోటు: పి. వి. రామచంద్రమూర్తిగారు, సాంబవిలాస్, 5/6 సులివాన్స్ గార్డెన్ రోడ్డు, మైలాపూర్; మద్రాసు.

## విజ్ఞానకందశతకము:—

శౌరిమకుటము. గ్రంథకర్త మదరాసు రామారావు. భాగవతుల నృసింహశర్మగారిచే బరిష్కృతము. అట్టపై గ్రంథకర్త ఛాయాచిత్రముగలదు. చిన్నసైజున 32 పుటలు. వెల రు. 0 3 0. దొరుకుచోటు యమ్. రాజారావు, చైనాబజారు, బరంపురము, గంజాముజిల్లా.




**మందసా సంస్థాన వ్యవహారములు:—**

మందసారాజావారు మరణించి ఆరుమాసములు దాటినది. వారి ఆస్తికంతకును రాణీగారే వారసురాలై యున్నది. అయినను ఇంకను ఎస్టేటు రాణీగారిపేర రిజస్టరుకాలేదని తెలియుచున్నది. ల్యాండు రెవిన్యూకమీషనరుగారగు వెర్నన్‌గారీనడుమ మందసాకుపోయి ఉన్నప్పుడు సంస్థానప్రజలు వారిని సందర్శించి సంస్థానపాలనము రాణీగారికి ఒప్పగించవలసి నదిగా కోరియుండిరి. రాణీగారు మిక్కిలి తెలివైన యామె. ఓఢ్రమునందును, ఆంధ్రము నందును ఆమెకు మంచి పరిచయముగలదు సంస్థానప్రజలెల్లరును ఆమెను 'తల్లిగారు'అని పిలుతురు. ఇది ఆమె ప్రియవాదితనమునకు మంచినిదర్శనము. తుని, జటప్రోలు, గద్వాల మొదలగు సంస్థానములను ఇపుడు స్త్రీలే నిర్వహించుచున్నారు. స్త్రీల కార్యనిర్వహణ చాకచక్యమున కీసంస్థానముల నేటిచరిత్రలు చక్కని నిదర్శనములు. కావున మందసావ్యవహార ములు స్త్రీహస్తమునబడిన చెడునని అనుమానించుటకు అవకాశములేదు. ఎట్టి కాలవిలం బమునుచేయక ప్రభుత్వమువారు సంస్థానపరిపాలనమును మందసా రాణీగారికి వశపఱుతురు గాకయని కోరుచున్నాము.

**శ్రీ రాధాకృష్ణపండితుడు: ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షత:—**

ఆంధ్రవిశ్వవిద్యాలయము 1926-వ సంవత్సరమున ఏప్రియలుమాసమున పుట్టువు గన్నది. అదిపుట్టినగడియమంచిదియైనదిగాదు. బలమైన బాలారిష్టములు కలిగినవి. బెజ వాడనుండి విశ్వవిద్యాలయకార్యస్థానము విశాఖపట్టణమునకు మారినది. ఇదిస్థానభ్రష్టత. ఉద్యోగుల అవ్యక్తతవలన ఆంధ్రుడగు రావుబహదరు డి. లక్ష్మినారాయణగారి నలుబదిలక్షల రూపాయిలును నాగపురవిశ్వవిద్యాలయమునకు పోయినవి. ఇది ధనహాని. ఇట్లుస్థాన భ్రష్టత, ధనహానికలిగించి దుష్టగ్రహములు కేంద్రస్థానమునుపీడినవి. శుభగ్రహములు ఉచ్చస్థానమునకు వచ్చినవి. రాధాకృష్ణపండితుడు ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షుడుగ ఎన్నుకొనబడినాడు. రాధాకృష్ణుడు ప్రపంచవిఖ్యాతిగన్న ఆంధ్రప్రముఖుడు. ఆంధ్రవిశ్వ

విద్యాలయోపాధ్యక్షతవలన ఆతనికికలుగగల క్రొత్తగౌరవము, ప్రఖ్యాతిఉండదు. కాని ఆతని వలన విశ్వవిద్యాలయమునకు కొండంతగౌరవము కొండంతప్రఖ్యాతిగలుగగలదు. రాధాకృష్ణుడు ఈనెల 20-వ తారీఖున విశ్వవిద్యాలయమును తనకై వశమొనర్చుకొనును. పుట్టినప్పటినుండియు ఈఅయిదేండ్లదియునగు ఆంధ్రవిశ్వవిద్యాలయచరిత్ర విస్మరింపదగినది. పండితునిప్రవేశముతో ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు నిజమైనచరిత్ర ప్రారంభమగును. ఇక దానియదృష్టరేఖ బయలుపడినదనుటలో సందేహములేదు. జన్మదేశమునుసేవింప తనకు ప్రపంచప్రఖ్యాతినార్జించియిచ్చిన కలకత్తావిశ్వవిద్యాలయమునుసయితము విడువనంగీకరించిన ఆంధ్రాభిమాని రాధాకృష్ణుని మనఃపూర్వకముగ నభినందింపని ఆంధ్రుడుండబోడు. మేమీ శుభావసరమున ఆంధ్రస్త్రీలపక్షమున పండితుని నొకవరముకోరుట కర్షించుచున్నాము. మదరాసురాష్ట్రమున స్త్రీలకొరకు ప్రత్యేకము అయిదుకళాశాలలున్నవి. కాని ఒక్కటిగూడ ఆంధ్రస్త్రీలదికాదు. పండితుడు పరిశ్రమించి ప్రత్యేకకళాశాలాభిక్షను ఆంధ్రస్త్రీలకు ప్రసాదించుగాకయని కోరెదము.

బెరిల్ డెనెట్ కన్య వీరమరణము:—

బెరిల్ డెనెట్ కన్య ధాత్రిగాకుదిరినది. మిలటరీ ఆస్పత్రిలో ఆమె సేవచేయవలసివచ్చెను. అచ్చటివారు అంటుజ్వరములచే విశేషముగ మరణించుచుండిరి. అట్టిచోటికి పోవుటయే క్షేమకరముగాని యప్పుడు అచ్చటి అంటురోగులకు ఉపచరింప నుద్యమించుట మృత్యుదంష్ట్రల నెదుర్కొనుటయేయగును. అగునుగాక దాయి బెరిల్ డెనెట్ కన్య ధైర్యముతో నచటికిపోయినది. రోగులకు ఉపచరించినది. అంటురోగమునకు తాను గుఱియైనది. రోగముతగిలిన ఇరువదినాలుగు గంటలలో ఆమె ఇహలోకమును విడిచినది. పుట్టినప్రాణి గిట్టకమానదు. ఆగిట్టుటలో కొందఱు ఇట్లు దివ్యముగగిట్టుచున్నారు. బెరిల్ డెనెట్ కీర్తిగీతము ఆంగ్లదేశమునందలి ప్రతివ్యక్తి నాలుకపైని ఉట్టంకితమైనది.

"సోదరీమణులారా! యుద్ధభూమికి కదలుడు":—

తుర్కీసామ్రాజ్యనియంతయగు ముస్తఫాకెమాల్ పాషా స్మిర్నాలోని బాలికాపాఠశాలలో నుపన్యసించుచు నిట్లుచెప్పెను: "ప్రస్తుతకాలమున స్త్రీలు ఓట్లహక్కు మొదలగు పౌరసత్వపుహక్కులకై పెనగులాడుచున్నారు. హక్కులనుభవించుటకు తాము పురుషులతో సమానము కావలయుననుదీక్ష నేటి స్త్రీలలో నెలకొనియున్నది. బాధ్యతలేని హక్కులేదు. కావున హక్కులకై పెనగులాడుటతోబాటు బాధ్యత వహించుటకుగూడ వారు పెనగులాడవలసియున్నది. పూర్వకాలమున స్త్రీలు పురుషులతో సమానబాధ్యతను వహించిరి. కావుననే వారితో సమానమైన హక్కులను పొందియున్నారు. ఆనాడు వారు పురుషులతో సమానముగ యుద్ధభూములకుపోయి చేతులు పొక్కినదాకా యుద్ధములుచేసియున్నారు. పూర్వస్త్రీలవలె పురుషులతో సమానమైన హక్కుల ననుభవించుట నేటి

స్త్రీల కోరికయేని వారు పురుషులతో సమానబాధ్యతనువహించి యుద్ధభూములకుకూడరావలయును. యుద్ధభూములకురాకుండ స్త్రీలను నిరోధించు విషయములేమియు నేకుగానరావు."
అహింసాత్మకమగు యుద్ధమున భారతస్త్రీలు పురుషులతో సమానముగ-ఒక్కొక్కచో అతిశయముగ-నిలబడినారు. హింసాత్మకమగు యుద్ధమున పాశ్చాత్యస్త్రీలు పురుషులతో సమానముగ నిలబడుదురేమో ఇకచూడవలసియున్నది.

**విధవావివాహసహాయకసభ:—**

మద్రాసునందలి విధవావివాహసహాయకసభవారి చతుర్థవార్షికనివేదిక మాకు చేరినది. ఈసభకు మద్రాసురాజధానిలో పలుతావులయందు శాఖాసంస్థలుగలవు. వితంతూద్వాహములు శాస్త్రసమ్మతములని ప్రచారముచేయుటకు కరపత్రములు ముద్రించి సభవారు రాజధాని ప్రజలకందించుచున్నారు. ఈ కరపత్రములు ఒక్కఆంగ్లముననేగాక దేశభాషలయందును వెలువరింపబడినవి. సభవారి యాజమాన్యమున నివేదితవత్సరమున రాజధానిమొత్తముమీద ఇరువదిరెండు వివాహములుజరిగినవి. ఇట్లు సంఘసేవచేయుచున్న ఈసంస్థకుచేర్చి వితంతుశరణాలయమొకటియుండుట అత్యవసరమైయున్నది. అది ధనముతో గూడినపని. లాహోరునందలి విధవావివాహసహాయకసంఘమువారు ఇట్టి శరణాలయమునకై మాసమునకు 100 రూపాయిలనీయతీర్మానించినారు. ఈమొత్తముతో శరణాలయము నిర్వహింపబడుట దుస్తరము. కావున ఇతరులు విరివిగ సహాయముచేయుదురుగాక యని కోరెదము. మద్రాసున ఈసభవారి కార్యస్థానము 161, బ్రాడ్వే, జార్జిటవునులోగలదు. ఉత్తరప్రత్యుత్తరములు ఆచిరునామాకు జరుపవచ్చును.

**మదరాసుశిశుసహాయకసంఘము:—**

ఈసంఘమువారి పంచమవార్షికనివేదిక పరిశీలనార్థము మాకుపంపబడినది. శిశుసహాయకసంఘమువారు చేయుచున్న ప్రశంసనీయమగు సేవనుగూర్చి వారిచతుర్థవార్షికనివేదికను పరామర్శించుచు గృహలక్ష్మి గతసంపుటమున విరళముగవివరించితిమి. ఈవత్సరమున సంఘము గమనింపదగిన అభివృద్ధినొందినది. ఈసంచికయందు వేఱొకచోముద్రింపబడిన ఈసంఘమువారి పాఠశాలకుసంబంధించిన చిత్రపటము లీవిషయమును ప్రత్యక్షీకరింపగలవు. ఈసంఘము క్రమాభివృద్ధినందుచు యథారీతిని దేశసేవచేయుచుండునుగాక!

**స్వాగతము:—**

ప్రమోదూతనామసంవత్సరము మొదటినుంచి ప్రమాదవత్సరముగనున్నను అంత్యమున ప్రమోదవత్సరముగ మారినది. గాంధి ఇర్వినులకు సంధినిగూర్చినది. కైలాసము మొదలు కన్యాకుమారివఱకుగల వివిధకారాగారముల ఇనుపతలుపుల తెఱపించినది. దేశభక్తుల చెఱలుబాపినది. "నాతోడనే లవణసత్యాగ్రహోద్యమము ప్రారంభమైనది. నాతో

డనే అది పర్యవసితముకావలయును. కావున సోదరీమణులారా! రండు. చెఱసాలలనువీడి రండు. మంగళారాత్రికలనుబట్టుడు. మీయందు నిక్షిప్తమైయున్న ధైర్యసాహసములను లోకమునకుప్రదర్శింప అవకాశముకలిగించిననాడు "వీడ్కోలొసంగుడు" అని ప్రమోదమాత ఆంధ్రప్రమదల నాహ్వానించినది. వారును ఆఆహ్వానమంగీకరించి తమకార్యశౌర్యమునకు ప్రదర్శనశాలయగు ఈవిశాలాంధ్రభూమినితిరిగి తమ పవిత్రపాదములతో మెట్టినారు; ప్రమోదమాతకు వీడ్కోలు, ప్రజోత్పత్తికి ఎదుర్కోలును జరిపినారు. ఈశుభసమయమున ఆసోదరీమణులకందరకును గృహలక్ష్మి తనస్వాగతమును చెప్పుకొనుచున్నది.

**కాశ్మీరదేశమున ప్రసవవైద్యవిధానము:—**

ప్రసూతివైద్యవిధానమున కాశ్మీరదేశప్రభుత్వమువారు ప్రత్యేకశ్రద్ధను వహించియున్నారు. ప్రతిపెద్దపట్టణమునందును స్త్రీలకుప్రత్యేకమైనవైద్యశాలలు ఏర్పఱుపబడినవి. క్రమశిక్షనొందిన ధాత్రులు, మంత్రసానులుమాత్రమే ఈవైద్యశాలలయందు పనిచేయుటకు చేకొనబడుదురు. శ్రీమహారాణి కటోచీదేవిగారి కోరికననుసరించి ఇప్పుడు నాలుగుపెద్ద ఆసుపత్రులు ప్రత్యేకము స్త్రీలకొఱకునిర్మింపబడినవి. అవిఒక్కచో నిలుకడగనుండవు. దేశమునందలి వివిధగ్రామములవెంట నిరంతరము సంచరించుచుండును. వివిధప్రాంతములయందు మంత్రసానులకు ఉచితమగు తరిబీయతునీయ ఏర్పాట్లుజరిగినవి. మార్చిమాసమున కాశ్మీరదేశపు మంత్రివర్గమువారుసమావేశమై జమ్మునందును శ్రీనగరమునందును మంత్రసానితనమునకు లైసెన్సుపొందుసూత్రములను నిర్వచించిరి. జమ్ము, శ్రీనగరము ఈ మునిసిపాలిటీల రెండింటియందును మంత్రసానివృత్తినవలంబించువారు ముందుగపట్టాను పొందవలసియుండును. ఇట్టిపట్టానుపొందుటకు స్టాంపుకాగితముపైవ్రాసి దరఖాస్తుపెట్టవలెను. పట్టానుమునిసిపలు ప్రెసిడెంటుయిచ్చును. ఇట్లు ఇచ్చుటకుగాను ఆతడు ముగ్గురు పరీక్షాధికారులతో సంప్రదింపవలసియుండును. ఆరోగ్యశాఖాధికారి, ఘోషా ఆసుపత్రి అధికారిణి, మఱియొకవైద్యురాలు పరీక్షాధికారవర్గము. క్రమశిక్షనుపొందిన సర్టిఫికేటుగాని చిరకాలానుభవముగాని లేనివారికి పట్టా ఈయబడదు. అంటురోగములుగలదియు, పద్రాసియునగుస్త్రీ పట్టానుపొందజాలదు. ఈఏర్పాటులవలన క్రమశిక్షనొందిన మంత్రసానులు వృద్ధినొందగలరనియు సాలుమూలము తెలియని తెలవలింక నీవృత్తి నవలంబింపజాలరనియు భావింపబడుచున్నది. క్రమశిక్షనొందిన మంత్రసానులసంఖ్య వృద్ధినొందుకొలదిని దేశమున ప్రసూతిమరణములసంఖ్య తగ్గగలదనుటలో సందేహములేదు. కావుననట్టిమంత్రసానుల సంఖ్యను వృద్ధినొందించుప్రయత్నము లెంతయుప్రశంసనీయములు. బ్రిటీషుయిండియాలో గూడ నీవిషయమై విశేషప్రయత్నము జరుగునట్లు ప్రజ లాందోళనము సల్పవలసియున్నది. నాయకులు పూనుకొందురుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.